# హిందూమత ప్రవేశిక

(A Handbook of Hindu Religion)

ఆంధ్రానువాదము :

డాక్టర్ కాశీభట్ట సేతురామేశ్వర దత్త,
యం. ఏ. పిహెచ్. డి.




ప్రచురణ :

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

(A Handbook of Hindu Religion)

*Translated by* :

**Dr. Kasibhatta Sethurameshwara Datta,** M. A. Ph.D.

**T. T. D. Religious Publications Series No. : 279**

First Edition : 1985

*Copies* : 5.000

*Published by* :

Sri S. Lakshminarayana, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

*Printed at* :
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati.

ఈ ప్రపంచంలో వేదభూమియైన భారతదేశం చాలా పవిత్రమైంది. పరమతసహనానికి దయ, అహింస, ప్రేమ మొదలైన సుగుణాలకు మనదేశం పుట్టినిల్లు. హిందూమతం ఈ గుణాలకు అద్దం వంటిది. దేహానికి ప్రాణం ఎటువంటిదో దేశానికి మతం అటువంటిది. ప్రాణం లేని దేహం వ్యర్థమైనట్లు మతచైతన్యం, ఆధ్యాత్మికచింతనలేని మానవజీవనం నిరర్థకము. ఒక దేశముయొక్క గొప్పతనం ఆ దేశము యొక్క ఆధ్యాత్మిక సంపదమీద ఆధారపడి ఉంటుంది; కాని భౌతిక సంపదమీద కాదు. కనుకనే భౌతిక సంపదతో ఉన్నతస్థితిలో ఉండే అమెరికా, బ్రిటన్, జర్మనీవంటి దేశాలు ఆధ్యాత్మిక వాతావరణంతో నిండిన భారతదేశాన్ని నేటికీ మిక్కిలి గౌరవిస్తున్నాయి.

కాని, ప్రతి హైందవుడు తన మతముయొక్క, తన దేశముయొక్క ఔన్నత్యాన్ని తెలిసికొనలేక పోవడంవల్ల విదేశీయమతాల దుష్ప్రచారం వల్ల తన మతాన్ని గౌరవించ లేక పోతున్నాడు. దురదృష్టవశాత్తు మన దేశంలో పాశ్చాత్యవ్యామోహం ప్రబలడంవల్ల ఆధ్యాత్మికత జాతీయ భావం అంతరిస్తున్నాయి. దీనికంతా కారణం మన మతాన్ని గురించి సంగ్రహంగా సులభంగా దేశభాషల్లో తెలియజేసే గ్రంథాలు ప్రజా సామాన్యానికి, పామరులకు అందుబాటులో లేకపోవడమే.

వైదేశికమతాల ధాటికి, మతాంతరీకరణానికి తట్టుకొని నేటికీ హైందవ మతం స్థిరంగా నిలవడానికి కారణం ఈ మతంలో ఉండే సర్వజనసమ్మతత్వం, సర్వమతసహనాలే. కనుకనే పాశ్చాత్యులు భారతదేశాన్ని, హైందవమతాన్ని వేనోళ్ల కీర్తిస్తున్నారు.

పూర్వకాలంలో మతాన్ని రాజులు పోషించేవారు. రాజుల ఆదరాభిమానాలను బట్టి మతానికి ఉచ్చనీచస్థితులు కలిగేవి. రాజులు లేని నేటికాలంలో మతసంస్థలు, మతగురువులూ ప్రజలలో మతవ్యాప్తికి, ధార్మికజీవనానికి పాటుపడుతారు.

శ్రీవేంకటేశ్వరుని కరుణాకటాక్షంతో విలసిల్లుతూ ఉండే శ్రీ తిరుమల తిరుపతి యాజమాన్యంవారు వేదరక్షణకు, ప్రజలలో ఆసికతను

కలిగించడానికి ఇటీవలి కాలంలో చాలా పెద్ద ఎత్తున ప్రయత్నాలు
స్తున్నారు. ఎన్నో క్రొత్త ప్రణాళికలు రూపొందిస్తున్నారు.
హైందవమతసాహిత్యాన్ని, హైందవమతాన్ని గురించి తెలిపే ప్ర
లను ప్రకటించడం ఒకభాగము. ఇదివరకు తాము ఆంగ్లంలో ప్ర
చిన The Handbook of Hindu Religion అనే ఆంగ్ల గ్రం
తెలుగులోనికి అనువాదం చేయించి ప్రకటించడం చాలా సంత
మైనవిషయం. ఆంగ్లగ్రంథాన్ని రచించినవారు శ్రీ పి. యస్. శ్రీని
చారి, శ్రీ పి. వి. రామానుజస్వామి, డా॥ కె. సి. వరదాచారిగారలు.
ముగ్గురు భారతీయతత్త్వశాస్త్ర నిష్ణాతులు. సంస్కృతాంగ్లాలలో ఉ
లైన పండితులు. వీరి ఆంగ్లగ్రంథాన్ని తెలుగులోనికి అనువదిం
అంత సులభం కాదు. అందులోను వీరు పాశ్చాత్యతత్త్వశాస్త్రంలో
గొప్పవిద్వాంసులు కాబట్టి వీరి గ్రంథంలో పాశ్చాత్య తత్త్వశాస్త్ర
భాష అక్కడక్కడ వాడబడి ఉంది. ఆంగ్లంలోని పదాలకు తెలు
సరియైన పదాలు కొన్ని సందర్భాల్లో దొరకవు. నా ఆంధ్రానుః
కొన్ని తావులలో యథామూలంగాను కొన్ని తావులలో స్వతంత్రం
సాగింది. కొన్ని సందర్భాల్లో పునరుక్తు లుండడంవల్ల అవి :
మైనంతవరకు అనువాదంలో పరిహరింపబడినాయి. కొన్ని విషం
సంగ్రహింప బడినాయి.

ఈ అనువాదంలో పిన్నలకు, పెద్దలకు, పండితులకు, పామ
అర్థమయ్యే విధంగా వ్యావహారిక భాష వాడబడింది. ఇది వి
ప్రధానమైన గ్రంథము. దోషములను విజ్ఞులు మన్నింతురు గాక
గ్రంథంయొక్క ప్రాశస్త్యాన్ని ప్రత్యేకించి చెప్పవలసిన పనిలేదు.
అనువాదం పాఠకలోకం ముందు ఉంచబడింది. దీనిని చదివి ఫలిత
పొందగలరు! ఆంగ్లగ్రంథాన్ని తెలుగులో అనువాదం చేయుమని న
కోరి నా కీ అవకాశం కల్పించిన తిరుమల తిరుపతి దేవస్థానములః
నా హార్దిక కృతజ్ఞతలు. శ్రీవేంకటేశ్వరునికి నా సహస్రప్రణామము

ఇట్లు

తిరుపతి, శ్రీవేంకటేశ్వర పాదారవింద సేవ

# ముందుమాట

ప్రతి జాతికి తనదైన జీవన విధానం ఒకటి ఉంటుంది. ఆ విధానాన్ని ఆ యా కాలాలలో పుణ్యపురుషులో, తత్త్వవేత్తలో లౌకిక పారలౌకిక విషయాలతో సహా అన్నిటినీ కూలంకషంగా పరిశీలించి, ఆ జాతికి ఏది హితమో ఆలోచించి నిర్దేశించి ఉంటారు. మనిషికి వ్యక్తిత్వంలాగా ఆ జీవన విధానం ఆ యా జాతులను రూపు దిద్దుతుంటాయి. ఇలా ఏర్పడిన విధానమే జాతి అభిమతంగా చివరకు నేటి 'రిలిజియన్' గా మారింది. లౌకిక ప్రభుతా ప్రాభవాలను పట్టి ఆ యా మతాల భోగభాగ్యాలు మారుతూ వచ్చాయి. రాను రాను మతశబ్దానికి అనర్థం పట్టి, సమాజ వ్యవస్థలు అటు మతహితంగానో, మతరహితంగానో, మతబద్ధంగానో నడుస్తూండటం, వాటి ఆద్యంతాలు చరిత్ర పుటలలో స్థిరం కావటం సాధారణ విషయం.

కాని భారతదేశంలో మాత్రం ధార్మిక స్రవంతి అనాదినుంచి ఈనాటి వరకు అవిచ్ఛిన్నంగా సరసజీవన ఝరిలాగా సాగివస్తున్నది. తరాలు గడచినా, పాలకులలో అంతరాలు, లౌకిక జీవనంలో అవాంతరాలు ఏర్పడినా ఆగకుండా నిత్యనూతన జీవనాన్ని సంతరించుకొని సాగిపోతున్నదంటే అందుకు కారణం ఈ జీవన విధానం అనాది కావడం, ఏకద్రష్టృప్రోక్తం కాకపోవడమే. పలువురు మహనీయులు జీవన సమస్యా సాగరాన్ని మథించి మథించి అందించిన జ్ఞానామృతాన్ని అందినంతవరకూ అందరికీ అందించిన పుణ్యభూమి కాగలిగిందంటే, కారణం ఈ జాతికి పట్టుగొమ్మగా వున్న ఆ ధార్మిక జీవన తత్త్వమే. అందుకే విశ్వజనీనమైన ఈ ధర్మం ఋషిప్రోక్తంగా అర్షమై కాలగతులకు ఎదురు నిల్చి అస్తిత్వాన్ని నిల్పుకుంది.

మరి ఇంతటి ఈ విశిష్ట ధర్మానికి ప్రాతిపదిక సూత్రాలను ఒక మాటలో చెప్పాలంటే 'సహజీవన సిద్ధాంతాధారంగా పలువురు మహ

సందర్శనాస్వాద యత్నమే తిరుమల తిరుపతి దేవస్థానం ఇప్పటి ఆస్తిక మహోదయుల కందిస్తున్న ఈ హిందూమతప్రవేశిక.

లోగడ దేవస్థానం 'ఎ హాండ్ బుక్ ఆఫ్ హిందూ రెలిజియన్' అన్న పేర వెలువరించిన ఆంగ్లమూలానికి డా॥ కె. సేతురామేశ్వరదత్త చేసిన ఈ సరళానువాదం ఆస్తిక జనులందరికి అభిమానపాత్ర మౌతుందనీ, తద్ద్వారా, దుర్భావపరిచ్ఛన్న ధార్మికతా మహా మందిరానికి సుందర వాతాయన సదృశం కాగలదనీ ఆకాంక్షిస్తూ, అలా ఆశీర్వదించ వలసిందిగా వేంకటేశ్వరస్వామివారిని వేడుకుంటున్నాము.

యస్. లక్ష్మీనారాయణ
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

తిరుపతి,
జూలై 23, 1985.

# ఒకటవ అధ్యాయము

## అవతారిక

ప్రపంచంలో సజీవంగా విలసిల్లుతూ ఉన్న మతా లన్నింటి లోను హైందవమతం చాలా ముఖ్యమైనది. ఇది అన్ని మతాల కన్న చాలా ప్రాచీన మైనది. దీనికి సనాతనధర్మ మని పేరు. ఒక మతం యొక్క పవిత్ర గ్రంథాలను, వాటిని ఆ మతాచార్యులు వ్యాఖ్యానించిన తీరును, మహాత్ములు మునులు మొదలైనవారు ఆ మతం లోని సత్యాలను గుర్తించిన తీరును తెలిసికొననిదే మతానికి సంబంధించిన అధ్యయనం లేక పరిశీలన పరిపూర్ణం కాజాలదు. మతాన్ని గూర్చి తెలుసుకోవడానికి కావలసిన పూర్తి వివరాలను హైందవమతం సమకూరుస్తుంది. కాబట్టి హైందవమతం మాత్రమే సమగ్రమైన విశ్వాజనీనమైన మతమని నిస్సందేహంగా చెప్పవచ్చును.

హిందూమతం చారిత్రకమైన మతం కాదు, అంటే ఈ మతం యొక్క పుట్టుక, వ్యాప్తిని గురించి ఏ చరిత్రగ్రంథమువల్ల కూడ తెలిసికొన వీలుపడదు. చారిత్రక పురుషుడెవ్వరూ దీనిని స్థాపించలేదు. చారిత్రక మతాలు, ఆ మతాల్లోని మహాత్ములు, పెద్దలు తెలుసుకొన్న సత్యాలను ఆధారంగా చేసికొని మతసూత్రాలను, సిద్ధాంతాలను ప్రబోధిస్తాయి. మహాత్ములకు, ఋషులకు వెల్లడించబడి, స్మృతులచేత పరమప్రమాణా లని చెప్పబడుతున్న వేదాలు హైందవమతానికి ఆధారము. వేదమనగా ఈశ్వర వచనము. వేదమే ఈశ్వరుడు కనుక వేదం నిత్యమైనది. వేదాలను అపౌరుషేయా లంటారు. అంటే వేదాలను ఎవ్వరూ వ్రాయ లేదు, సృజింప లేదు అని అర్థము. హైందవమతం ఆద్యంతాలు లేని సనాతనమతము. ఇది వేదాలు, వేదాంగాలు, స్మృతులు, ఇతిహాసాలు,

రచించిన స్తుతికీర్తనలతో కూడియుంది అనాదిగా, అవిచ్ఛిన్నం వస్తున్న మతము. మారుతున్న పరిస్థితుల కనుగుణంగా అవలంబిం బడిన శాశ్వత, ఆధ్యాత్మిక సత్యాలను ఈ మతం విపులంగా బోధిస్తుం ముఖ్యంగా, అవశ్యంగా, తప్పకుండా ఆచరించవలసిన విషయాల సడలింపులు లేకుండా, అముఖ్యమైన విషయాలను సడలింపులతో హిందూమతం వివరిస్తుంది.

ఈ మతానికి హిందూమత మనే పేరు విదేశీయులచే కల్పిం బడింది. దీని అర్థము కూడ అనిశ్చితమైంది. పరిపూర్ణత, సమగ్ర ఈ మతంలో ఉన్నాయి కాబట్టి ఈ మతానికి 'సనాతనధర్మము' అ పేరు ఎంతో బాగుంటుంది. కాని హిందూమతం అనే పేరు వాడుక అందరిచేత అంగీకరింపబడి ఎక్కువ వ్యవహారంలో ఉంది. 'ధర్మమ అనే శబ్దం వైయక్తిక, సాంఘిక, నిత్యజీవితంలో ప్రతిబింబిం సన్మార్గప్రవర్తనకు అన్వయిస్తుంది. అంతేకాక అది మోక్షధర్మా (అంటే సంసారబాధలనుండి విముక్తిని) నిగూఢంగా సూచిస్తుం ధర్మ మనేది ఒక జీవన విధానమేకాక జీవితదృష్టి కూడా. దీని సిద్ధాంతము, ఆచరణ— ఈ రెండూ ఉన్నాయి. హైందవమతా వేదాలు ముఖ్యప్రమాణాలు. ఈ మతాన్ని ఆచరణపూర్వకంగా అ చేసుకోడానికి స్మృతులు మొదలైనవి సహాయపడుతాయి. వేదా నాలుగు. అవి ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వ వేదము. ప్రతివేదంలోను మంత్రాలు, బ్రాహ్మణాలు, ఉపనిషత్తులు అ మూడుభాగా లున్నాయి. మంత్ర, బ్రాహ్మణముల నిగూఢార్థాన్ని తెలు కొన్న వానికి మంత్రద్రష్ట అని పేరు. మంత్రద్రష్టకు ఆంతర, బాహ ప్రకృతిమీద ఆధిపత్యం లభిస్తుంది. వేదాలు మానవజాతియొక శైశవస్థితికి చెందినవని చెప్పడం తప్పు. "ఏకం సత్ విప్రా బహు

స్వరూపం, విశ్వజనీనత సూచింపబడినాయి. ఉపనిషత్తులు లేక వేదాన్తాలు అనేవి హిందూమతంలో చాలా ఉదాత్తమైన బోధనలు. వీటిని తెలుసుకొనడంవల్ల పరబ్రహ్మను గురించిన జ్ఞానం కలుగుతుంది. కనుక వీటికి "బ్రహ్మవిద్య'' అని కూడ పేరు. ఇవి మానవులకు జీవితకాలంలోను, మరణ సమయంలోను దుఃఖోపశమనం కలిగిస్తాయి. బ్రహ్మజ్ఞాన మనదగు వేదవిజ్ఞానమంతా 'ఓం' అనే ప్రణవంలో సంక్షిప్తంగా చెప్పబడింది. వేదాలు ధర్మార్థకామమోక్షాలనే పురుషార్థాలను గురించి చెప్పినా బ్రహ్మానుభవం లేక మోక్ష మనే ఉత్తమ పురుషార్థాన్ని చెప్పడమే వాటి పరమ ప్రయోజనము. అందుకే వేదాలకు ''బ్రహ్మవిద్య'' అని కూడ పేరు. శిక్ష, వ్యాకరణము, జ్యోతిషము, ఛందస్సు, కల్పము, నిరుక్తము అనే ఆరు వేదాంగాల సహాయం లేనిదే వేదాలను అర్థము చేసికోజాలము.

మనుస్మృతి మొదలైన స్మృతులు (ధర్మశాస్త్ర గ్రంథాలు) హైందవుల వైయక్తిక, సాంఘిక ఆచార వ్యవహారాలను తెలియజేస్తాయి. అవి మానవునికుండే హక్కులు, అధికారాల కన్న అతనికి విధింపబడిన ధర్మాలు, విధులు, గుణాలను వివరిస్తాయి. సర్వ సామాన్యంగా అందరికీ అన్ని దేశాలవారికీ అన్ని కాలాల్లోను అన్వయించే సత్యం, అహింస మొదలైన ప్రధాన గుణాలు, కొన్ని కాలాలకు మాత్రమే పరిమితమైన యుగ ధర్మాలు — ఈ రెండుకూడ స్మృతులలో చెప్పబడినాయి. "కలౌ పారాశరస్మృతిః" అని చెప్పబడడం వల్ల "పరాశరస్మృతి'' కలియుగంలో ప్రమాణమై అనుసరింపదగిన ధర్మశాస్త్ర గ్రంథ మయింది. రామాయణ, మహాభారతేతిహాసాలు విష్ణువును రామ, కృష్ణావతారాల్లో వర్ణిస్తాయి. క్షీణిస్తున్న ధర్మాన్ని పునః ప్రతిష్ఠించడానికి దుష్టులను శిక్షించడానికి అల్లకల్లోల సమయంలో భగవంతుడు భూమిమీద అవతారా లెత్తుతాడు. భగవంతుడు దుష్టులను

ఆ విధంగా శిక్షించడం వారిని సంస్కరించి బాగుచేయడానికి అని మనం తెలుసుకోవలెను. హైందవమత సాహిత్యంలో పదునెనిమిది పురాణా లున్నాయి. వీటిలో విష్ణుపురాణం, భాగవతపురాణం ముఖ్యమైనవి. అన్ని పురాణాల్లోను ఈ ప్రపంచం యొక్క సృష్టి స్థితి లయాలు దీర్ఘంగా వర్ణింపబడినాయి. భగవంతుడు ఏ విధంగా మానవు లందరికీ రక్షకుడుగా, ముక్తిదాయకుడుగా సహాయం చేస్తాడో తెలియ జేయడమే పురాణాల ఉద్దేశము. అదే విధంగా భగవంతుడు మానవ లోకంలో అర్చారూపంలో (విగ్రహ రూపంలో) వెలసి మానవులను ఏ విధంగా పాపములనుండి తప్పిస్తాడో ఆగమాలు బోధిస్తాయి. దేవా లయాల్లోని అర్చామూర్తులను స్తుతించే నాయనార్ల, ఆళ్వార్ల కీర్తన లన్నీ భగవంతుని మోక్షదాయకానుగ్రహాన్ని సంపాదించడానికే రచింపబడినాయి.

భగవంతుడు భూలోకంలో మనుష్యస్థాయికి దిగి మానవులంద రిని దైవస్థాయికి లేవనెత్తడమే మతంయొక్క పరమోద్దేశము. వేదాలు, స్మృతులు, ఇతిహాసాలు, పురాణాలు, ఆగమాలు, నాయనార్ల ఆళ్వార్ల కీర్తనలను చదవడంవల్ల మనకీ ఉద్దేశం అవగత మవుతుంది. వేదాలలో చెప్పబడిన బ్రహ్మమే ఉపనిషత్తులలోని అంతర్యామి; అనగా అంతట అన్నింటియందు ఉన్నవాడు; స్మృతి పురాణాలలోని భగ వంతుడు, ఇతిహాసాలలోని అవతారమూర్తి, నాయనార్ల ఆళ్వార్ల కీర్త నలలోని అర్చావతారము అంతా ఒకటే అని మనం తెలుసుకొనవలెను. భగవంతుని అనుగ్రహంతో మానవుడు పశుప్రవృత్తికల హీన మానవ దశనుండి సంస్కరింపబడిన మానవదశకు, చివరకు దివ్యమైనముక్తి దశకు చేరుకుంటాడు. విభిన్న తత్వాలు ప్రకృతులతో కూడిన మానవు లందరికి ఉపకరించడమే వేదాలు, స్మృతులు మొదలైన మత

హిందూమతం వేదాన్తమనే పేరుతో పైన చెప్పిన ప్రయోజనాన్ని తాత్త్వికపద్ధతిలో బోధిస్తుంది. వైశేషిక, న్యాయ, సాంఖ్య, యోగ, పూర్వమీమాంస, ఉత్తరమీమాంసా శాస్త్రాలను 'దర్శనము' లని అంటారు. సంసారబాధలను పోగొట్టి మోక్షప్రాప్తిని కలిగించడం అనే ఏకైక ఉద్దేశంతో ఈ దర్శనాలను వేర్వేరు ఋషులు ప్రవచించారు. న్యాయవైశేషిక దర్శనాలు ప్రమాణాలను, పదార్థముల తత్త్వాన్ని చర్చిస్తాయి. సాంఖ్య, యోగ దర్శనాలు పురుషుని, ప్రకృతిని గూర్చి వివరంగా చర్చించి పురుషుడు ప్రకృతినుండి ఏ విధంగా విముక్తుడౌతాడో వివరిస్తాయి. దేనిని తెలుసుకొనడంవల్ల ఇతర విషయాలన్నీ తెలియునో ఆ పరమోన్నత బ్రహ్మముయొక్క తత్త్వాన్ని ఉత్తర మీమాంస అంటే వేదాన్తశాస్త్రం బోధిస్తుంది. ఈ దర్శనాలన్నీ బ్రహ్మమును తెలుసుకొనగోరు ముముక్షువు వివేకం, వైరాగ్యం, నైతిక పరిశుద్ధిని పొందడానికి ఉపకరిస్తాయి.

జ్ఞానంయొక్క పరమోన్నత విషయం బ్రహ్మ లేక పరతత్త్వము అనే విషయాన్ని ప్రత్యక్ష, అనుమాన, ఆగమాది ప్రమాణాలు నిరూపిస్తాయి. అంతేకాక అవి పరమపురుషుని యథార్థత్వాన్ని నొక్కి చెప్పుతాయి. పరమపురుషుని పొందడమే ధర్మం యొక్క ప్రయోజనము. ఈ విషయమే ప్రస్థానత్రయమనే ఉపనిషత్తులు, గీత, బ్రహ్మసూత్రాలలో చెప్పబడింది. ఉపనిషత్తులు ఋషులకు భగవంతునితో కలిగిన ప్రత్యక్షానుభవాన్ని వర్ణిస్తాయి. వాటిలోని సారాంశమే గీతలో ప్రతిపాదింపబడింది. బ్రహ్మసూత్రాలు ఉపనిషత్తులు, గీతలోని తాత్త్విక బోధనలను వివరిస్తాయి.

"దర్శనము" అనే పదం సనాతన ధర్మం లేక వేదాన్తం యొక్క విస్తారతను, బాహుళ్యాన్ని సూచిస్తుంది. చక్షురాది ఇంద్రియా

అన్వయిస్తుంది. ఈ జ్ఞానం విశేషం, అనిత్యం అయినా యథార్థమైనదే కాని భ్రాంతికాదు. తర్కం లేక అనుమాన ప్రమాణం వల్ల లభించిన జ్ఞానం దృఢతరమైనది. ఇంద్రియ గోచరమైన ప్రత్యక్షానుభవంలోని విశేషాలను వివరించే కొన్ని సర్వతోముఖన్యాయాలను, సూత్రాలను అవగతం చేసుకోవడానికి తర్కం ఎంతో ఉపకరిస్తుంది. 'భూమి సూర్యుని చుట్టును తిరుగును. ఎందుకనగా అది ఒక గ్రహము' అనునటు వంటి ఉదాహరణాల్లో కల్పించే తర్కం, వివేచన అనే అర్థంలో 'తర్కం' కూడ ఒక దర్శన మవుతుంది. 'తర్కం' (అనుమానం)కన్న ఉన్నతమైనది అంతర్జ్ఞానం, లేక నమ్మాళ్వారలవంటి యోగులకు కలిగిన ప్రత్యక్ష బ్రహ్మానుభవము. ఇదే బ్రహ్మదర్శనము, జ్ఞానానికి పరమావధి. కనుక దర్శనమంటే భౌతికమైన ఇంద్రియాలనుండి వివేచనాత్మకమగు అంతర్నేత్రానికి, దానినుండి చివరకు బ్రహ్మసాక్షాత్కారమనే బ్రహ్మచక్షుస్సుకు పోవడమే. ఈ విధంగా జ్ఞానం మరింత జ్ఞానానికి దారితీస్తుంది. ప్రత్యక్షజ్ఞానం నుండి అనుమాన జ్ఞానానికి, అనుమాన జ్ఞానం నుండి బ్రహ్మసాక్షాత్కారానికి దారి ఏర్పడుతుంది. ఈ మూడింటి మధ్య సమన్వయం ఏర్పడి ఒకటికొకటి పూరకా లవుతున్నాయి. కనుక వాటి సంబంధంలో పరస్పర విరోధం లేకుండా ఉన్నది.

వేదమనేది ఒక గ్రుడ్డినమ్మకం కాదు. అది ఋషులు, మొదలయిన ద్రష్టలచేత యథార్థమని నిరూపింపబడిన ఆధ్యాత్మిక సత్యము. భగవంతుని ముఖాముఖిగ చూచిన గురువుయొక్క ఉపదేశంతో మనం ప్రత్యక్షంగా ఈశ్వరానుభవం పొందగలగడమే వేదాలవల్ల మనకు లభించిన జ్ఞానానికి పరీక్ష. 'దర్శనము' అనే పదం ఈ విధంగా ప్రత్యక్ష జ్ఞానానికి, ప్రత్యక్షజ్ఞానం నుండి పొందిన తార్కికజ్ఞానానికి, తార్కిక జ్ఞానం నుండి పొందిన బ్రహ్మానుభవానికి అన్వయిస్తుంది. కాబట్టి

వర్ణింపబడిన ప్రకృతి ప్రపంచంయొక్క యథార్థాన్ని అంగీకరిస్తుంది. కాని అనాత్మవాదం (అంటే చార్వాకమతం) జీవితానికి పరమావధి అవడాన్ని ఒప్పుకోదు. ఇది తర్కంయొక్క ప్రాముఖ్యాన్ని అంగీకరిస్తుంది కాని హేతువాదమే జీవిత చరమదృష్టి అనడాన్ని తిరస్కరిస్తుంది. అదే విధంగా వేదం (లేక శాస్త్రము) యొక్క ప్రాముఖ్యాన్ని అంగీకరించినా బ్రహ్మవిద్యాశాస్త్రాన్ని గ్రుడ్డి నమ్మకం అనడాన్ని ఒప్పుకొనదు. హిందూమతం విజ్ఞానశాస్త్రానికి, తత్త్వశాస్త్రానికి, బ్రహ్మవిద్యాశాస్త్రానికి తగిన స్థానం కల్పించి వాటికి పరస్పరానుకూల్యం కలిగిస్తుంది. భగవంతుడు ఉన్నాడనడానికి నిదర్శనం ఈశ్వరానుభవం పొందడమే.

జీవితాన్ని సామూహికంగా కలసికట్టుగా బ్రతకవలెనని, ప్రతి మానవునికి సంఘంలోని ఇతరుల విషయంలో కొన్ని విధులు, ధర్మాలు ఉంటాయని ప్రబోధించడంవల్ల హైందవమతం వైయక్తిక లేక ఒక వ్యక్తికి సంబంధించిన మతం కాదు. కాని ఈశ్వరుడు తన సంకల్పాన్ని (ఉద్దేశాన్ని) నెరవేర్చుకొనడానికి మానవుని సహాయమపేక్షిస్తాడు అనే పాశ్చాత్యసిద్ధాంతాన్ని హైందవమతం అంగీకరింపదు. మానవుడు తాను చేసేపనులన్నీ కూడ ఈశ్వరారాధన అనే కైంకర్యభావంతో వినమ్రుడై చేస్తాడు. యథార్థంగా చూస్తే మానవుడు చేసే ప్రతి సాంఘిక సేవాకార్యక్రమంకూడా సర్వాంతర్యామియైన ఈశ్వరుని ఆరాధించడమే అవుతుంది. ఒక జీవునికి మరొక జీవునికి మధ్య ఏ విధమైన ఆధ్యాత్మికాంతరాయాలు లేవు కనుక హిందూమతం పరస్పరసంబంధం సార్వజనీనమైనది. ప్రత్యక్షాది ప్రమాణములకు పరీక్షకు నిలిచి తర్కానికి వేదాలకు మధ్య భేదం చూపదు. కాబట్టి ఈ మతం పరస్పరసంబద్ధము. ఈ మతములో న్యాయవైశేషికాది ప్రతిదర్శనానికి (సిద్ధాంతానికి) అద్వైత విశిష్టాద్వైతాది వేదాంతాలకు

స్థానం ఉండటంవల్ల ఇది సంధితము. అన్యమత ద్వేషాన్ని నిషేధించి మతాంతర్భేదములను అంగీకరించి మతాంతర్భేదములవలన కలిగే కలహాలను భేదభావాలను తిరస్కరించడంవల్ల ఈ మతం సహనశీల మైనది. ప్రతి మానవుడు తాను భగవంతుని పుత్త్రిడని (అనగా దైవాంశసంభూతుడని) తానే స్వయంగా భగవంతుని సాక్షాత్కరింప చేసుకొనవచ్చునని చెప్పే సత్యం ఈ మతంలో ఉండడంవల్ల ఇది సర్వజనీనం సర్వజనసమ్మతం అయినది. కాబట్టి ఇది నానావిధ సిద్ధాంతసంకరమై పరస్పరాసంగతమై ఏదో ఒక వ్యక్తిచే స్థాపింప బడిన మతం కాదు. ఈ మతం భిన్నభిన్నతత్త్వాలు ప్రవృత్తులు కల మానవులకు ఉద్దేశింపబడినా మానవులందరి గమ్యం ఒకటే అని ఘంటాపథంగా చెప్తుంది. ప్రతి మానవుడు (జీవుడు) తాను ఆధ్యాత్మికసంపదకలవాడని తానే ఆత్మ అని సర్వత్ర లోపల బయట ఆత్మ కలదని ప్రతి ఒకరు ఆత్మస్వరూపుడైన భగవంతుని సాక్షాత్కరించు కొనవచ్చునని ఈ మతం ఉద్ఘోషిస్తుంది. అందుకే హిందూమతాన్ని సనాతనధర్మం, వేదాన్తం, దర్శనం, బ్రహ్మవిద్య అనే సమానార్థక నామాలతో పిలుస్తారు. ఈ పేర్లన్నీ హైందవ మతంలోని ఆధ్యాత్మిక సత్యాలను స్పష్టంగా చాటుతాయి.

ఈ గ్రంథంలో చెప్పబడే ముఖ్యవిషయాలు ఈశ్వరప్రాప్తి సాధనములు, దేవతారాధనపద్ధతులు, పరమపురుషార్థమైన మోక్షం యొక్క స్వరూపం అనే మూడు తత్త్వాలకు సంబంధించినవి. ఇందులో వీటితోబాటు హైందవమతంయొక్క సార్వజనీనత, సర్వ జనసమ్మతత్వం కూడ చర్చింపబడుతాయి.

# రెండవ అధ్యాయము

## ఈశ్వరుడు

హైందవమతంలో దేవుని ఈశ్వరుడు, భగవంతుడు, పురుషోత్తముడు అనే వివిధనామాలతో పిలుస్తారు. ఈ పేర్లన్నీ అద్వితీయమైన ఆ పరతత్త్వానికి అన్వయిస్తాయి. కాని ఈశ్వరతత్త్వాన్ని వివరించడానికి మునుపు ఈశ్వరతత్త్వాన్ని గుణాలను గురించి పెడదారి పట్టించే పెక్కు నిరాధారమైన దురభిప్రాయాలను తొలగించవలసి ఉంటుంది. హైందవమతంలో మానవుడు తనకు తోచినవిధంగా తనకు ఇష్టం వచ్చినట్లు ఈశ్వరుని కల్పిస్తాడని, రాళ్లను చెట్లను మృగాలను, చనిపోయినవారిని ఆత్మలను దేవతామూర్తులుగా ఆరాధిస్తాడని, కాబట్టి ఈ మతంలో దేవుడు ఉత్కృష్టపురుషుడు మాత్రమే అనే దురభిప్రాయాన్ని హిందూమతవిమర్శకులు తరచుగా ప్రచారం చేస్తూ ఉంటారు. బాగా పరిశీలించినట్లయితే ఈ అభిప్రాయం అసంగతం, అసత్యం. హైందవులు ఆరాధించేది రాళ్లు, చెట్లు, మృగాలు మొదలైన బాహ్యప్రకృతిని కాదు. వారు ప్రకృతిలో అంతట అంతరాత్మ, అంతర్యామిగానున్న ఈశ్వరుని ఆరాధిస్తారు. దేవతాగుణములుకల మానవుని సృజింపవచ్చునే కాని మానవగుణములుకల దేవుని సృజింపలేము. హైందవులు పెక్కు దేవతలను ఆరాధించడంవల్ల వారిని బహుదేవతారాధకులని కొందరు విమర్శించడం అనుచితం. ఎందుకంటే దేవదేవుడైన ఈశ్వరుడు అందరి దేవులయందు సర్వాంతర్యామిగాను, నియంతగాను ఉండటంవల్ల ఏ దేవుని ఉపాసించినా సర్వోత్కృష్టుడు, పరతత్త్వము, అద్వితీయమైన ఈశ్వరుని ఆరాధించినట్లవుతుంది. కాబట్టి హైందవు లందరూ బ్రహ్మము ఒకటే, ఆయన అద్వితీయుడు, ఆయన ఈశ్వరుడు, ఈశ్వరు డొకడే, ఆయనకు చాలా పేర్లున్నాయి. ఆయనను ఏ పేరుతో నైనా ఏ రూపంలోనైనా ఆరాధింప

ప్రపంచంలోని సమస్త చరాచరాలకు అంతరాత్మగా నియంతగా ఉంటాడు అని చెప్పడమే తాత్పర్యం కాని, వాటితో సమానుడు అని చెప్పడం ఉద్దేశంకాదు. ఈశ్వరుడు పరిశుద్ధుడు, పరిపూర్ణుడు. కళంక రహితుడు. ఈశ్వరు నీ విధంగా వర్ణించినప్పటికి కొందరు కువిమర్శకులు హిందూమతంలో ఈశ్వరుడు ఒక భావానికి ప్రతీక మాత్రమే అని, అటువంటి ఈశ్వరు డుండడని విమర్శిస్తారు. ప్రతివ్యక్తికి ఒక ఇష్టదైవముంటాడని, ఇష్టదైవం ముందు భక్తికలిగి ఉండడమే మతం యొక్క లక్షణమని, ఈ ఇష్టదైవమే తాత్త్వికుల పరతత్త్వమని హైందవులందరూ అంగీకరిస్తారు. కాని ఈశ్వరుని అస్తిత్వాన్ని (అంటే ఈశ్వరుడున్నాడు అనే అభిప్రాయాన్ని) తార్కికంగా హేతువాదంలో ఋజువుచేయడానికి వీలుపడదు. ఈశ్వరుని అస్తిత్వాన్ని గ్రుడ్డి నమ్మకం అనడం కూడ సరియైనది కాదు. ప్రతి ఒకరు ఆసక్తితో ఈశ్వరుని పొందడానికి ప్రయత్నిస్తే ఈశ్వరుని ప్రత్యక్షంగా చూడవచ్చును. అటువంటివారిని ఈశ్వరుడే స్వయంగా కోరి వెతికి అనుగ్రహిస్తాడు, అతనిని పాపాలనుండి రక్షిస్తాడు. తాను ఈశ్వరునికన్న భిన్నుడని, తనకు ఈశ్వరునికి ఎడబాటుకలదు అనే భేదభావాన్ని ఈశ్వరుడు మానవుని హృదయమునుండి పోగొట్టుతాడు. ఈ విధంగా మానవులను (భక్తులను) రక్షించడమే ఈశ్వరుని విధి, ధర్మము. ఇది క్రమంగా ఐదు దశలలో జరుగుతుంది. బ్రహ్మము ఊహాతీతుడు, శుద్ధుడు. పరిపూర్ణుడు, బ్రహ్మమును 'పరము', అని అంటారు. ఈ బ్రహ్మమే ప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములకు కారకుడగుచున్నాడు, సకలజీవుల హృదయాలలో అంతర్యామిగా ప్రవేశించుచున్నాడు. ప్రపంచంలో అత్యంతసంకటపరిస్థితి ఏర్పడినప్పుడు దానిని తొలగించడానికి పరమాత్మయే మానవజన్మ నెత్తును. ఈ జన్మలనే

అవతారాలంటారు. శాశ్వత ప్రేమమూర్తియైన పరమాత్మ విగ్రహా రూపంలో వెలయడాన్ని అర్చావతార మంటారు. జీవులను పాపాల నుండి, అజ్ఞానంనుండి ఉద్ధరించి రక్షించడానికే ఈశ్వరుడిన్ని అవతారా లెత్తుతున్నాడు. ఈ విధంగా ఈశ్వరావతారాల ప్రయోజనాలు ఉద్దేశాలు, శ్రుతిస్మృతిపురాణేతిహాసములలోను. తమిళము మొదలగు దేశభాషలలోని కీర్తనలలోను వర్ణింపబడినాయి. ఉపనిషత్తులు ఈశ్వరుని పరతత్త్వాన్ని అంతర్యామిత్వాన్ని వెల్లడిస్తాయి. పురాణాలు ప్రపంచంయొక్క సృష్టిస్థితిలయకారునిగా ఈశ్వరుని వర్ణిస్తాయి. ఆ యా అవతారాలలో ఈశ్వరుడొనర్చిన శిష్టరక్షణ దుష్టశిక్షణలను ఇతిహాసాలు వివరిస్తాయి. స్మృతులు ఆయన నైతిక సౌందర్య శ్రేష్ఠతను, భజనకీర్తనలు వాత్సల్యాన్ని, సర్వజనసౌలభ్యాన్ని వర్ణిస్తాయి. పరమాత్ముడు మనోహరమైనరూపాన్ని ధరించి జీవులనాకర్షించి తనలో చేర్చుకొంటాడు. ఇవే పరబ్రహ్మముయొక్క ఐదు దశలు. ఈ పరబ్రహ్మమే ఉపనిషత్తులలో చెప్పబడిన ఈశ్వరుడు. ఈయన పరిశుద్ధుడు, పరిపూర్ణుడు. ఆయన తత్త్వాన్ని సంపూర్ణంగా వర్ణించుటకు వీలుపడదు కాని ఆయన ముఖ్యగుణములు దిక్మాత్రంగా సత్యం, జ్ఞానం, అనంతం, ఆనందం అనే శబ్దాల్లో వర్ణింపబడినాయి. ప్రకృతివలె కాక బ్రహ్మము నిత్యుడు, పరిణామరహితుడు; అది ఆయన స్వయంప్రకాశకుడు, సూర్యచంద్రనక్షత్రాదులకంటె మిక్కిలి కాంతివంతమైనవాడు, నిర్మలుడు, సర్వదోషరహితమైనవాడు పరమాత్ముడు స్వతస్సిద్ధంగానే ఆనంద, వాత్సల్య స్వరూపుడు, అద్వితీయుడు, ఎన్నో సుగుణములు కలవాడు. ఆయనకున్న గుణాలలో ముఖ్యమైనది ప్రేమ లేక వాత్సల్యము. దీనితో జీవులకు తన స్వభావాన్ని ఇచ్చి వారిని తనవంటివారినిగా చేస్తాడు. ప్రపంచమంతటా పరమాత్ముడున్నాడు. ఈ పరమాత్మను చేరడమే—పొందడమే

ప్రపంచంతో సంబంధం కలిగిన పరమాత్మను ఈశ్వరుడంటారు. ఆయన ప్రపంచాన్ని సృష్టించి పాలించి నాశనం చేస్తాడు. ఈ మూడు విధులను క్రమంగా బ్రహ్మ, విష్ణు, శివరూపాల్లో నెఱవేరుస్తాడు. ఈ విధులన్నీ వివరంగా అష్టాదశ (పదునెనిమిది) పురాణాల్లో, ముఖ్యంగా విష్ణు, భాగవత పురాణాల్లో, వర్ణింపబడినాయి. ప్రపంచం జీవులు, ప్రకృతితో కూడి ఉంది. ఇవి నిత్యమైనవి. ఇవి అసత్తునుండి సృష్టింప బడలేదు. మొలకెత్తడానికి ముందు బీజంలో అంతర్గతంగా ఉండే వృక్షంవలె సృష్టికి పూర్వం ప్రళయకాలంలో జీవులు, ప్రకృతి నిగూఢంగా ఉంటాయి. అవి తమ తమ ప్రాప్తనకర్మ ననుసరించి సృష్టికాలంలో బ్రహ్మదేవునివల్ల నూతన దేహాలను ధరించి, కర్మల నుండి విముక్తిని పొందడానికి పరిపూర్ణతను సంపాదించడానికి కొత్త కొత్త అవకాశాలను పొందుతాయి. ప్రపంచంయొక్క స్థితి అనే దశలో జీవులు తమ తమ కర్మల ననుసరించి ముల్లోకాలలో సంచరిస్తూ జీవిస్తూ ఉంటారు. తమ్ము తాము ఉద్ధరించుకోవడానికి నాశనము చేసుకోవడానికి జీవులకు స్వేచ్ఛ ఉంటుంది. జగత్పాలకుడైన విష్ణువు వారిని పోషిస్తూ వారిని సరియైన మార్గంలో నడపుతాడు. ప్రపంచంలో అధర్మం, పాపాలు ఎక్కువ వృద్ధి చెందినప్పుడు శివుడు ప్రపంచాన్ని తాత్కాలికంగా లయం (నాశనం) చేస్తాడు. సృష్టిస్థితి లయాలనే మూడు కార్యాలను పరమాత్ముడనే పేరు కల ఈశ్వరుడు తన సంకల్పంతో నిర్వహిస్తాడు. జీవులను అజ్ఞానం పాపాలనుండి రక్షించుటకు పరమేశ్వరుడు నిర్వహించే సృష్టిస్థితిలయాలు ఆయన ధర్మం (విధి) లోని మహోన్నతమైన అంశాలు. జీవులందరూ ముక్తి పొందువరకు ఈ క్రమ మిట్లు జరుగుచునే యుండును.

ప్రపంచాన్ని సృష్టించిన తరువాత బ్రహ్మము అంతర్యామిగ దానియందు అనుప్రవేశము చేయును. ఈ ప్రపంచము అచిత్ లేక జడరూపమగు భౌతికపదార్థములు, చిద్రూపమగు జంతు, మానవ, దివ్యజీవులతో కూడి యున్నది. బ్రహ్మము వాసుదేవుని రూపమున చిదచిదాత్మకమగు ఈ విశ్వ మంతా వ్యాపించి ప్రతి జీవునియందు, వృక్షమునందు, జంతువునందు, మానవునియందు, దేవతలయందు అంత రాత్మగా, శరీరిగా ఉండును. ఈ విధంగా వాటిలో అంతరాత్మగా ఉన్నను వాటి దోషములు బ్రహ్మమును బాధింపవు, అంటవు. బ్రహ్మము చిదచిదాత్మకమగు సమస్త వస్తుజాలంలో అంతరాత్మగా ఉండి వాటికి జీవం పోసి వాటిని శాసించును. జీవ, జడపదార్థాలన్నీ పరమాత్మ తృప్తికొరకే ఉంటాయి. వాటిని పాపాలనుండి తప్పించి తనలోనికి చేర్చుకొనడమే పరమాత్మని ఉద్దేశము.

బ్రహ్మము సమస్త చిదచిద్వస్తుజాలంలో విశ్వమంతా వ్యాపించి ఉండడంవల్ల బ్రహ్మము రాయి, కుక్క, శ్వపచులతో సమాన మవు తుందని ఇదే హైందవమతంలోని ముఖ్యమైన లోపమని కొందరు విమర్శిస్తారు. కాని ఈ అభిప్రాయం సరియైనది కాదు. ఈశ్వరుడు (బ్రహ్మము) అన్ని ప్రాణులలోను అంతర్యామిగా నియంతగా ఉంటాడే కాని వాటితో ఐక్యాన్ని పొందడు. అచేతనమైన వస్తుజాలమంతా జీవులకన్నా భిన్నమైనది. ఈశ్వరుడు అచేతనములు సచేతనముల కంటే భిన్నుడు కాని వాటితో అత్యంతసన్నిహిత సంబంధాన్ని కలిగి ఉండడానికి వాటిలో ప్రవేశిస్తాడు. ప్రేమకు అధిపతిగా ఈశ్వరుడు జీవుల హృదయకమలాలలో నివసించడంవల్ల మన దేహాలను దేవా లయం లేక బ్రహ్మపురి అంటారు. దివ్యత్వానికి స్థానమగుటచేత మన దేహం పవిత్రంగా భావించబడుచున్నది. దానిలో పాపాలను

అపవిత్రతకు స్థానముండదు. ఈశ్వరుడే వాత్సల్యము. జీవుడు దైవముగా మారవలెననే సంకల్పంతో ఈశ్వరుడు జీవునియందు అను ప్రవేశంచేయును.

## అవతారములు

పరబ్రహ్మము అవతారాలనెత్తి జీవులను పాపములనుండి కష్టములనుండి రక్షించును అనే సిద్ధాంత రామాయణం మహాభారతాలలో స్పష్టంగా వివరింపబడింది. ఈ విషయం భగవద్గీతలో వ్యాసునిచే స్పష్టం చేయబడింది. భగవంతుడే స్వయంగా గీతలో (iv-8) చెప్పినట్లు ధర్మం నశిస్తూ అధర్మం అభివృద్ధి పొందు సమయంలో ఆయన అవతారాల నెత్తుచున్నాడు. ఇందుకొరకాయన దివి నుండి భువికి దిగివచ్చి విలక్షణమైన అవతారాలనెత్తి దుష్టశిక్షణ, శిష్టరక్షణ, చేస్తూ జగత్తునందు ధర్మాన్ని పునరుద్ధరిస్తాడు. అవతారాల నెత్తిన భగవంతుడు దుష్టులను శిక్షించడమే కాకుండా వారిని దుష్టమార్గాల నుండి పాపాలనుండి రక్షించి వారికి వాత్సల్య, కృపామయమగు తన స్వరూపాన్ని చూపించి వారిని ఆశీర్వదించి వారిలో నైతికప్రబోధాన్ని దైవభక్తిని కలుగజేయడమే అవతారాల ఉద్దేశము. వాస్తవంగా చూస్తే దుష్టశిక్షణలోని దండనంకూడా ఒక విధమైన దయాకార్య మవుతుంది. ఎందుకంటే దుష్కార్యం చేసినవానిని సంస్కరించి సన్మార్గునిగా చేయడమే భగవంతుని ఉద్దేశంగాని దుష్టులను కేవలం శిక్షించుట కాదు. అవతారమంటే ఉచ్చస్థాయినుండి నీచస్థాయికి భౌతిక దేహంతో భూమిమీద అవతరించడం కాదు. భగవంతుడు వాత్సల్యంతో మానవ స్థాయికి అంతకంటే తక్కువ స్థాయికి దిగే ఆధ్యాత్మికావత

విష్ణువుయొక్క ముఖ్యమైన అవతారాలలో రామ, కృష్ణావతారములు ముఖ్యమైనవి. ప్రపంచానికి సంభవించిన అతిసంకటస్థితిలో ధర్మాన్ని నైతిక ప్రవర్తనాన్ని పునరుద్ధరించడానికి, ధర్మరాజ్యాన్ని స్థాపించడానికి భగవంతుడు రామకృష్ణావతారాలకన్నా ముందటివైన మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన అవతారాల నెత్తెను. రామరాజ్యమనే ధర్మపాలనాన్ని స్థాపించడానికి రావణునివంటి దుష్టులను శిక్షించడానికి శ్రీరాముడు అవతరించినాడు. మూర్తీభవించిన దైవప్రేమయే భగవదవతారములని, అవి పుట్టుకలో గాని ఇతరవిషయాలలో గాని ఏ విచక్షణ చూపింపక అన్ని జీవులకు, జంతువులకు ముక్తిని తప్పక ప్రసాదిస్తాయని శ్రీమద్రామాయణము, భగవద్గీత చెప్పుచున్నవి. కాబట్టి అవతారము సర్వలోకరక్షకమని పొగడబడుతూ ఉంది.

## అర్చ

భగవంతుణ్ణి శిలా, దారు (చెక్క), తామ్ర (రాగి) మయమైన విగ్రహరూపంలో ఆరాధించడం హిందువులలో సర్వసామాన్యము. అర్చారూపాలు ఆళ్వారుల నాయనారుల ఇతర భక్తుల కీర్తనలతో పునీతం గావింపబడినాయి—భగవంతుని విగ్రహాలు కేవలం కంకర, సున్నము, రాతితో చేయబడిన బొమ్మ లని నాస్తికునకు భాసిస్తాయి. కాని ఆధ్యాత్మిక దృష్టికల భక్తుని కవి జీవకళ, ప్రేమల నొలకబోసే సౌందర్యరాశియైన భగవంతుని రూపాలుగా భాసిస్తాయి. విగ్రహాన్ని ఒక భావమని, మనోరథమని, కల్పితప్రతిమ అని, ప్రతీక అని భావించ కూడదు. భక్తుని ప్రార్థనలమేరకు వాత్సల్యస్వరూపుడు సర్వవ్యాపియైన ఈశ్వరుడు శాశ్వతంగా వెలసే విగ్రహాన్ని 'అర్చ'

రూపంలో భగవంతుని విష్ణు, శివ, శక్తి రూపాల్లో కోరుతాడు. అప్పుడు నామరూపాతీతమగు దివ్యత్వము భక్తుడు కోరిన రూపంతో వెలుస్తుంది. భక్తుడు ఈ రూపంలో వెలసిన భగవంతుని చూస్తూ, ధ్యానిస్తూ, ఆయనలో లీనమైనట్లు భావిస్తాడు. అందుకే ఆళ్వారులు భక్తి, ముక్తులకన్నా భగవంతుని పాదాల వద్ద శరణు పొంది శ్రీనివాసుని సన్నిధిలో ఒక రాయిగా (మెట్టుగా) ఉండి శ్రీనివాసుని నిత్యం దర్శించే భక్తులచే త్రొక్కబడడమే మేలని భావించినారు.

## మాతృభావము

మాతృభావమనే సిద్ధాంతం హైందవమతంలోని ప్రత్యేక లక్షణము. ఇది సున్నితమైన ప్రేమ, దయ అనే ప్రత్యేకలక్షణాలు కలిగిన దివ్యకారుణ్యాన్ని వెల్లడిచేస్తుంది. ఈశ్వరభావం ఈశ్వరుడు సర్వశక్తిమంతుడు, పరిశుద్ధుడు అనే విషయాన్ని బోధించి భక్తునికి భయం, భక్తి, గౌరవాలను కలిగించి ఆతనిలో తాను అయోగ్యుడనే భావాన్ని కలిగిస్తుంది. భక్తుడు భగవంతుని స్వర్గంలో ఉండే తండ్రిగా, లోకపతిగా భావించి స్తుతించడమనేది మానవులంతా దేవుని సంతానము, మానవులంతా దేవుని ప్రతిబింబాలు అనే హైందవసిద్ధాంతంమీద ఆధారపడి ఉంది. ఈ సిద్ధాంతం కూడా దివ్య వాత్సల్యాన్ని, దయను సంపూర్ణంగా వెల్లడి చేయలేకపోవడంవల్ల ఈశ్వరుడే సమస్తచరాచరాత్మకమైన ప్రపంచంయొక్క సృష్టికి కారకుడని, ఈశ్వరసృష్టియొక్క సారము వాత్సల్యము, కరుణ అని తెలుస్తుంది. ఈశ్వరుడు జగత్పాలకుడుగా, న్యాయాధిపతిగా ప్రతిఒకరికి వారి వారి కర్మల ననుసరించి ధర్మబద్ధంగా న్యాయనిర్ణయాన్ని చేస్తాడు. కాబట్టి శాసన

ఏ మానవుడుకూడ తాను కేవలము ధర్మమార్గాన్నే అవలంబిస్తున్నానని చెప్పగలిగినంత పరిశుద్ధంగా, పాపరహితంగా ఉండడు. దయకు అనర్హమగు నంతటి పాపం ఏ దుష్కృత్యంలో కూడ లేకపోవడంవల్ల సృష్టికర్తయైన ఈశ్వరుడు తల్లివలె మానవుల పాపాలను క్షమిస్తున్నాడు. అందుకే ప్రతి భక్తుడు, విమోచనకారకమై వాత్సల్యస్వరూపిణియైన లక్ష్మి లేక పార్వతి లేక శక్తియొక్క అనుగ్రహాన్ని కోరుతాడు. కాని అయాచితంగా చూపబడిన దయ పక్షపాతానికి, విశృంఖల జీవితానికి దారి తీయవచ్చును. దయనుపొందిన పాపి తనకు లభించిన అపరాధమన్ననను దుర్వినియోగ పరచుకొనవచ్చును. కాబట్టి హైందవులు భగవంతుని ఈశ్వరీసహిత ఈశ్వరునిగా కొలుస్తారు. ధర్మం తీక్ష్ణమైనది, వాత్సల్యం దయాళువైనది. కాని ఈశ్వరునిలో ధర్మం, వాత్సల్యం ఒకటి కొకటి కలసిపోయినాయి. అవి వేర్వేరుగా ప్రవర్తించినా యథార్థంగా అవి రెండూ ఒకటే.

హిందూమతంలో జీవ (ఆత్మ) విచారానికి ముఖ్యమైన స్థానం ఉన్నది. జీవితముయొక్క పవిత్రతను, జీవులందరి ఐక్యాన్ని హిందూ మతం నొక్కి చెప్పుతుంది. పరమాత్మను ధ్యానించి పరమాత్మ సాక్షాత్కారాన్ని పొందడానికి మునుపు ప్రతి జీవి తనలోని ఆత్మను ధ్యానించుకొంటూ ఆత్మసాక్షాత్కారాన్ని పొందవలెను. ఆత్మ ప్రకృతి దానియొక్క మూలవస్తువులకంటే భిన్నమైనది. అది పృథివి, అప్, తేజస్సు, వాయువు, ఆకాశము అనే పంచభూతాలతో నిర్మింపబడిన దేహంకంటే ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానాలనే పంచ ప్రాణాలకంటే, మనోబుద్ధి, చిత్త, అహంకారాలతో కూడిన సూక్ష్మ శరీరం కన్నా వేరైనది. శరీరాలెన్నో పుట్టిపోతున్నా ఆత్మమాత్రం మార్పు చెందదు. అది జన్మ, మృత్యువులకు, జాగ్రత్ స్వప్న సుషుప్తులనే మానసిక వికృతులకు అతీతంగా ఉంటుంది.

ఈ విధంగా జీవుడు తన ధర్మమైన జ్ఞానం (చైతన్యము) కంటే భిన్నుడు. ధర్మమైన జ్ఞానం మార్పు పొందుతుందేకాని ఆత్మ మార్పు పొందదు. జాగ్రదవస్థలో జీవుడు బాహ్యప్రపంచాన్ని ఎరిగి ఉండడం వల్ల జీవుని పంచకర్మేంద్రియాలు తమ తమ వ్యాపారాల్లో నిమగ్నమై ఉంటాయి. జీవుడు కండ్లతో వస్తువులను చూస్తాడు. చెవితో శబ్దాలను వింటాడు. ముక్కుతో వాసన చూస్తాడు, నాలుకతో రుచి చూస్తాడు. చర్మంతో స్పర్శ ననుభవిస్తాడు. కాబట్టి ఇంద్రియానుభవాలు జీవుని లోను, ఇంద్రియానుభవాలను కలుగజేయు వస్తువులు బాహ్య ప్రపంచం లోను ఉన్నాయి. స్వప్నావస్థలో జీవుడు వస్తువులను చూడలేడు. కాని మానసికంగా చురుకుగా ఉండి సుఖదుఃఖాలను అనుభవిస్తాడు. సుషుప్తి లేక గాఢనిద్ర అనే అవస్థలో జీవుడు సంపూర్ణ విశ్రాంతిలో ఉండడంవల్ల జీవుని చైతన్యం పని చేయదు. అది పని చేయకపోయినా

సహజంగానే ఆత్మ స్వప్రకాశం, క్రియాశీలం, ఆనందమయం, నిత్యమైనది. అది ఈశ్వరుని యొక్క అంశము. అదొక నిత్యతత్త్వమైనా ఈశ్వరునికంటే భిన్నమైనది. దానికి పుట్టుక, చావు లేవు భూత, భవిష్యత్, వర్తమానాలనే కాలాలు దానికి లేనందున అది త్రికాలాతీతము, దేశాతీతము. అది ముఖ్యంగా స్వయంవేద్యమైనది. దానికి జ్ఞానమనే ధర్మం ఉండడంవల్ల దానికి యోచన, అనుభవం, సంకల్పం మొదలైన వ్యాపారాలున్నాయి. ఆత్మ పదార్థం కాదు. దానికి నైతికస్వాతంత్ర్య మున్నది కాబట్టి అది నిశ్చేష్టితంగా ఉండదు. ఆనందమయ మవడంవల్ల దానికి దుఃఖము లేదు. ఇట్లది తన ఆధ్యాత్మిక స్వభావముతో ఉండియే ప్రకృతి, ఈశ్వరులకన్నా భిన్న మగుచున్నది దానికి స్వీయమైన గొప్పతనము, సహజమైన యోగ్యత, స్వతంత్రత ఉన్నాయి. రాయి, కర్రముక్క మొదలైన వానివలె అది జడమైన వస్తువు కాదు. అది ప్రకృతికి దాని గుణములకు లోబడక కామము, క్రోధము, ద్వేషము, అసూయ మొదలైన దుర్గుణములు లేకుండా తన అధీనంలో తాను ఉంటుంది. కనుక ఆత్మ స్వతంత్రంగా నిత్యంగా ఉండే పారమార్థిక మూర్తి. ఇది జ్ఞాత, స్వతంత్రమైన కర్త, ఆనందభరితమైనది. సంసారంయొక్క పాపాలకు, బంధ వశమైన ఆత్మను బద్ధజీవు డంటారు. అది ఎట్లు అనాద్యవిద్యాసంపర్కంవల్ల తనను తాను, ప్రకృతితో నిర్మింపబడిన దేహంగా భ్రమించి ఎన్నో జనన మరణ పరంపరలను పొంది బాధపడుతుంది. దీని నీ విధంగా పోల్చవచ్చును. రాజకుమారు డొకడు చిన్నతనంలో అడవికి వేటకు పోయి, త్రోవ తప్పి అడవిలోని కిరాతులతో స్నేహం చేసి కిరాతకన్యను వివాహమాడి ఆమె యందు సంతానాన్ని పొంది ఆటవిక జీవితంలో నిమగ్ను డగును. ఈ విధంగానే ఆత్మ ఎట్లో తన దివ్యధామాన్ని విడిచి, అచిత్తుచేత సృష్టింపబడిన దేహాన్ని ప్రవేశించి ఇంద్రియలోలుప

పోయి అవిద్యా, కామ, కర్మలవల్ల బాధపడుతుంది అనే విషయం మనకు తెలియదు. కాని ఆ యా పాపాలు, కష్టాలు జీవకర్తృకములు కాబట్టి వాటికి జీవుడే బాధ్యత వహింప వలసి ఉంటుంది. అవిద్య జీవుని ప్రకృతితోను, దాని గుణాలతోను తాదాత్మ్యము (ఐక్యము) పొందునట్లు చేస్తుంది. కామము జీవుని ఇంద్రియసుఖాలను పొందడానికై ప్రేరేపించి అతనిని దుఃఖాల పాలు చేస్తుంది. అదే విధంగా జీవుని తన వశం చేసికొని అనంతమైన జననమరణాలకు గురి చేస్తుంది. అవిద్యా, సంస్కారాలయొక్క పుట్టుక తెలియకపోయినా అవి జ్ఞానముచే నాశనము చేయబడుతాయి. తత్ఫలితంగా పునరావృత్తి లేకుండా ఆత్మ ఈశ్వరుని చేరుకొంటుంది. కాని దాని యథార్థస్వరూపం అవిద్యచేత కప్పబడి ఉన్నంతవరకు ఆత్మ కర్మబద్ధమై జనన మరణాలనే సంసార చక్రంలో తగుల్కొని ఉంటుంది.

## కర్మ

హైందవధర్మశాస్త్రంలో కర్మసిద్ధాంతానికి ప్రముఖస్థానం ఉంది. మానవుల జీవితంలో కనిపించే అసమానతలకు, నానావిధ దుఃఖాలకు కారణమేమి అనే ప్రశ్నకు కర్మ సిద్ధాంతం బదులు చెప్పుతుంది. జీవితంలో దుష్టుడు ఎందుకు వృద్ధిపొందుతాడు? సజ్జనుడు ఎందుకు దైహిక, మానసిక సాంఘిక కష్టాలను అనుభవిస్తాడు? క్రొత్తగాపుట్టిన శిశువుకూడ తన తల్లిదండ్రులు చేసిన పాపాలవల్ల, అనంతమైన కష్టాలవల్ల ఎందుకు బాధపడుతుంది? ప్రపంచంలో దయగల ఈశ్వరుడుంటే ఇన్ని కష్టాలు, పాపాలు ఎందుకున్నాయి? ఈ సమస్యలు, ప్రశ్నలు మానవుడు పుట్టినప్పటినుండి ఉన్నాయి. కాని వీటికి కర్మ సిద్ధాంతం చెప్పిన సమాధానాలు, పరిష్కారాలు అందరికీ ఎక్కువ

కర్మసిద్ధాంతానికి చాలా ప్రశస్తి వచ్చింది. పాపాలు దుఃఖాలు జగత్తులో ఉన్నప్పటికి తన జీవితంలో జరిగే పాపాలన్నిటికి మానవుడే బాధ్యుడౌతాడు. అతని పాపాలకు ఈశ్వరుడుగాని ఇతరులుగాని బాధ్యులు కారు. కర్మసిద్ధాంతమనేది మానవుని నైతికజీవితానికి అన్వయింపబడిన సృష్టిసిద్ధాంతము. ప్రతిమానవుడు తాను చేసిన కర్మలకు తానే స్వయంగా ఫలాన్ని అనుభవిస్తాడు. మనోవాక్కాయములతో మనఃపూర్వకంగా చేయబడిన కర్మఫలిత మెన్నటికి నశింపదు, వృథాకాదు. ఆ కర్మల ఫలితం దేహంలో పదిలపఱుపబడి ఉంటుంది. వెనుకటి జన్మలోని కర్మలఫలితమే ఈ జన్మలోని కర్మలు. ఈ జన్మలోని కర్మ ఆగామి (రాబోవు)కర్మకు కారణ మవుతుంది. ఈ విధంగా కర్మలన్నీ పరస్పర కార్యకారణాలుగా సంబద్ధములై అవిచ్ఛిన్న కర్మపరంపరలకు దారి తీస్తాయి. సృష్టిసిద్ధాంతం ఏ అపవాదాలు లేక ఏకరీతిగా పనిచేస్తుంది. అది, చేసినకార్యాన్ని అనుసరించి దండనాన్నిగాని బహుమానాన్నిగాని ప్రతిఫలంగా ఇచ్చే నైతికసిద్ధాంతము. మానవుడు పుణ్యకర్మలనుచేస్తే బహుమానం లభిస్తుంది. తన సుకృతాలను అనుసరించి ఆరోగ్యము, దీర్ఘాయువు, సంపద, అధికారము, కీర్తి మొదలైన వాటిని అనుభవిస్తాడు, దుష్కర్మల నాచరిస్తే అతనికి దండనము (శిక్ష) ప్రాప్తిస్తుంది. అంతే కాక దుష్కర్మల ఫలితంగా రోగాలు, దారిద్ర్యం, దుఃఖాలు కలుగుతాయి. సుకృతము, దుష్కృతము ఈ విధంగా సుఖాలకు దుఃఖాలకు దారి తీస్తాయి. గణితశాస్త్రంలోవలె ధర్మసుఖాలమధ్య, అధర్మదుఃఖాల మధ్య స్థిరనిష్పత్తి ఉంటుంది. ఈ విధంగా ప్రతిమానవుడు తన సుకృతానికి దుష్కృతానికి తానే స్వయంగా బాధ్యు డౌతాడు.

## దేహాంతరప్రాప్తి

పునర్జన్మ, దేహాంతరప్రాప్తి అనేవి జీవుల కర్మ

మనస్సుతో పుట్టదు. కేవలము తల్లిదండ్రులవలన పుట్టదు. వంశపారంపర్య సిద్ధాంతాన్ని అనుసరించదు. ఏ కర్మ యొక్క ఫలితంకూడా నశించదు కాబట్టి సూక్ష్మ శరీరంలో నిలచి ఉండే వాసనారూపమైన ఇష్టాలతో ప్రతి శిశువు జన్మిస్తుంది. మానవుడు చనిపోయినప్పుడు అతని స్థూలశరీరము మాత్రము నాశము (లయము) పొందుతుంది. కాని ఆ జీవుని సూక్ష్మశరీరము తన కర్మ ఫలితా లన్నింటినీ తనయందే ఉంచుకొంటుంది. తన పూర్వ కర్మల ననుసరించి జీవుడు తనకు తగిన క్రొత్తశరీరాన్ని చేరి తిరిగి జన్మ నెత్తుతాడు. ఈ విధంగా ప్రతి జన్మ పూర్వజన్మకర్మల ఫలితమనీ అది తిరిగి క్రొత్త శరీరాలకు జన్మలకు కారణమవుతుం దని మనం తెలుసుకోవలెను. మనుష్యు డే విధంగా చిరిగిన వస్త్రాలను విడిచి నూతన వస్త్రాలను స్వీకరిస్తాడో ఆ విధంగా జీవుడు జీర్ణించిన శరీరాన్ని వదలి నూతన శరీరాలను చేరుతాడు. శైశవంనుండి ముసలితనంవరకు మానవుని జీవితంలో నిరంతరత (అవిచ్ఛిన్నత్వము) వైయక్తిక అభిన్నత్వము ఉన్నట్లు జన్మ, పునర్జన్మ పరంపరలలో అదే జీవుడు అవిచ్ఛిన్నంగా ఉంటాడు. జీవునికి పెక్కు జన్మలు ప్రాప్తించినా అతడు నిత్యుడగుటవలన అన్ని జన్మల లోను అభిన్నంగా ఉంటాడు.

జీవుని కర్మాచరణం ఇహలోకానికే పరిమితమైనది కాదు. అది తన కర్మఫలితా న్ననుసరించి ఒక దేహంనుండి మరొక దేహంతో బ్రహ్మలోకం నుండి పాతాళలోకం వరకు గల మూడు లోకాలలో సంచరిస్తూ ఉంటుంది. స్వర్గంతో ప్రారంభమైన ఊర్ధ్వ, దివ్యలోకాలలో సత్త్వగుణం ప్రధానంగా ఉండడంవల్ల జీవుడు సుఖాలను అనుభవిస్తాడు. అతల లోకంతో ప్రారంభమైన అధోలోకాలలో తమోగుణం

విస్తాడు. ఇట్లే నక్షత్రాలవలె అసంఖ్యాకాలైన ఇతర బ్రహ్మాండాలు ఉన్నాయి. వాటిని జీవుల కర్మల ననుసరించి ఈశ్వరుడు పరిపాలిస్తున్నాడు. సజ్జనులు తమ సత్కార్యాలవల్ల ఊర్ధ్వలోకాలను చేరి అక్కడ దివ్యసుఖాలను అనుభవించి కర్మఫలితం ముగియగానే భూమికి దిగివచ్చి తిరిగి మానవులుగా, పశుపక్ష్యాదులుగా పుట్టుతారు. అదే విధంగా దుష్టులు అధోలోకంలో దుఃఖాలను అనుభవించి కర్మ ఫలితం ముగిసిన తరువాత ఈ నైతిక ప్రపంచంలో తిరిగి జన్మనెత్తుతారు.

## బంధవిమోచనము

జీవుల జన్మపరంపరకు, బంధమోక్షాలకు కారణముగా చెప్పబడిన కర్మసిద్ధాంతము, 'సర్వము పూర్వనిర్ణీతము, కర్మను తప్పించుటకు వీలులేదు, కర్మను ఏదీ తప్పింప లేదు అనే నిరాశాజనకమైన కర్మవాదానికి, 'జగత్తు సర్వము చెడుగా ఉన్నది, దీనిని బాగుపరచుటకు వీలుపడదు. ఈ జగత్తులో తరణోపాయము లేదు. అనే నిరాశావాదానికి దారితీస్తుందనీ దీనివలన జీవులు బాగుపడే ఆశయే లేదని కొందరు విమర్శిస్తారు. ప్రతి మానవుడు తాను చేసిన మంచి, చెడ్డ పనులకు తగినట్లుగా ఫలితాలను అనుభవించి తీరవలెను. ఆ కర్మలకు ప్రతిక్రియ చేయలేనప్పుడు వాటి ఫలితాలను అనుభవించి తీరవలెను. ఈ విధంగా మానవుడు పరిస్థితులకు బానిస అవుతున్నాడు అనికూడ కొందరు విమర్శిస్తారు. ఈ విమర్శకు ఈ క్రింది విధంగా బదులు చెప్పవచ్చును. శాస్త్రీయమైన కర్మసిద్ధాంతం కర్మయొక్క ఏకాంశాన్నే వివరిస్తుంది. ఈ సిద్ధాంతంలోని ముఖ్యాంశము మానవునికి అంటే జీవునికి నైతిక స్వేచ్ఛ లేక సంకల్ప స్వేచ్ఛ ప్రసాదింపబడినదనీ, దానివలన ప్రతి

లైన మనోవికారాలను నిగ్రహించుకొనవచ్చునని చెప్పడము. ఈ కర్మసిద్ధాంతము ప్రారబ్ధకర్మకే అన్వయిస్తుంది గాని సంచితకర్మల కన్వయింపదు. ప్రారబ్ధకర్మ అనేది అప్పుడే ప్రారంభమైన కర్మకు పేరు. దీనిని మానవులెవ్వరు మార్చడానికి వీలులేదు. సంచితకర్మ అనేది ఆగామి (రాబోయే) కర్మను సూచిస్తుంది. ఇది మానవశక్తిలో ఉంటుంది. ప్రతిమానవుడు తన కర్మకు తానే ప్రభువు, కర్త. కాబట్టి ఈశ్వరుడు కూడ దీనిని మార్చలేడు. ఎటువంటి జీవితాన్ని కోరుకొన వలెను అనే విషయంలో మానవునికి పరస్పరవిరోధంకల కోర్కెలు కలిగితే తన కెటువంటి జీవితం కావలెననే విషయాన్ని నిర్ణయించు కోవడానికి అతనికి నైతిక స్వేచ్ఛ ఉంది. కాబట్టి మానవుడు కోపము. ద్వేషము మొదలైన మనోవికారాలను నిగ్రహించు కొంటే నైతిక విజయాన్ని పొందగలడు. అట్లు కాకుండా పశుప్రవృత్తిని కోరితే తిరిగి సంసారచక్రంలో తగులు కొంటాడు. ఆ విధంగా సంసారంలో తగుల్కొని బాధల ననుభవించి పశ్చాత్తాపం పొంది ఆత్మసంయమనం ద్వారా ఉత్తమమైన ముక్తి మార్గాన్ని వెదకుతాడు. ఈ రెండు దృష్టాంతా లలోను ప్రతి జీవునికి ఉత్తమ లేక అధమ మార్గాలను కోరాడానికి తగిన స్వాతంత్ర్య మున్నది. జీవునికి ఏమి కావలెనో దానిని కోర డానికి స్వాతంత్ర్యమున్నది. కాని కోరిన కోర్కెలకు అనుగుణమైన ఫలాన్ని పొందడానికి శక్తి ప్రసాదింపబడలేదు. కోర్కెల ఫలితాలు కర్మమీదను, ప్రపంచ ధర్మాలమీదను ఆధారపడి ఉంటాయి.

ప్రతి ఆస్తిక మతం ప్రకృతి, ఆత్మ, ఈశ్వరుడు అనే మూడు పరతత్త్వాల యొక్క స్వరూపస్వభావాలు, ధర్మాలు, వాటి పరస్పర సంబంధాలను గురించి చర్చిస్తుంది. హైందవమతంలో ప్రకృతికి అచిత్, పాశము అని, ఆత్మకు చిత్, పురుషుడు పశువు అని, ఈశ్వరునికి పురుషోత్తముడు, పతి అని నామాంతరములు కల్పించి వీటికి చక్కటి వివరణ ఇవ్వబడింది. ప్రస్తుతం ప్రకృతి అనగా నేమి, దాని ఉపయోగ మేమి అనే విషయాలు చర్చింపబడుతాయి. ప్రకృతి అనేది జగత్తులోని ఇండ్లు, చెట్లు, నదులు, సముద్రములు, పర్వతాలు మొదలైన వస్తువుల సముదాయానికి పేరు. దానిలోనే ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు చేరి ఉన్నాయి. ప్రకృతియొక్క అద్భుత వ్యాపారాన్ని వివరంగా తెలిసికొనుటకు మాత్రమే శాస్త్రజ్ఞుడు ఉత్సాహాన్ని చూపుతాడు. రసాయనశాస్త్రజ్ఞుడు ఈ ప్రపంచం ఏ యే లోహాలు, అలోహాల కలయికతో ఏర్పడినదని తెలిసికొంటాడు. అదే విధంగా ఖగోళశాస్త్రజ్ఞుడు సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు మొదలైన దివ్యజ్యోతుల తత్త్వాన్ని, జీవశాస్త్రజ్ఞుడు దేహంయొక్క తత్త్వాన్ని, ధర్మాలను తెలిసికొనగోరుతారు. శాస్త్రజ్ఞుడు ప్రకృతియొక్క అద్భుతవ్యాపారాలను బాగా గమనించి వాటి కాధారమైన సామాన్యసూత్రాలను కనుగొనడానికి ప్రయత్నిస్తాడు. మతంలో నమ్మకం, దైవభక్తి ఉండే మానవుడు ప్రకృతితత్త్వాన్ని తెలిసికొని ప్రకృతి జీవునికంటే ఈశ్వరునికంటే భిన్నమైనదని గ్రహిస్తాడు. జగత్ కర్తయైన ఈశ్వరుని గురించిన జ్ఞానం సంపాదించడమే అతని ముఖ్యోద్దేశము.

మన చుట్టూ ఉండే బాహ్యప్రపంచాన్ని కన్ను, చెవి, ముక్కు, నాలుక, చేయి అనే ఇంద్రియాలద్వారా చూస్తాము, అనుభవిస్తాము.

పట్టిన రంగును కంటితో గమనిస్తాం, దానిని చేతితో ముట్టుకొని చూ
త్తుంచి దాని వాసనను ముక్కుతో చూస్తాము, దాని తీయని రుచిని నాలుకతో రుచి చూస్తాము. ఇట్లే జగత్తులోని చెట్లు, ఇండ్లు, సరస్సులు, నదులు, కొండలు మొదలైన వస్తుజాలా న్నంతటినీ చూస్తాము. ఊర్ధ్వలోకంలో ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు ఉన్నాయి. మనం నివసించే భూమిమీద దేశాలు, ఖండాలు, సముద్రాలు ఉన్నా యనీ, అది సూర్యునిచుట్టూ తిరిగే ఒక గ్రహమనీ భూగోళశాస్త్రం బోధిస్తుంది. మనం నివసించే భారతభూమి గంగా, సింధు వంటి దీర్ఘ నదులతో హిమాలయాలవంటి పర్వతాలతో, మఱ్ఱివంటి పెద్ద చెట్లతో నిండిన ఆధ్యాత్మికదేశము; అది మనకు చాలా పవిత్రమైన దేశము. సూర్యుడు వేడిమికి, వెలుతురుకు కేంద్రము. సూర్యునిచుట్టూ బృహస్పతి, శని మొదలైన ఆరు గ్రహాలు తిరుగుతూ ఉంటాయి. చంద్రుడు భూమిచుట్టూ తిరుగుతాడు. ఇది అంతా కలిసి సూర్యకుటుంబం అన బడుతుంది. ప్రతి నక్షత్రం తన చుట్టూ ఉండే గ్రహాలతో, చంద్రులతో ఒక్కొక్క సూర్య డనిపించుకుంటుంది.

సూర్య, నక్షత్ర కుటుంబాలయొక్క ఆధిక్యతతో పోలిస్తే మన మెంత చిన్నవారము అనే విషయం భూగోళశాస్త్రాధ్యయనంతో తెలుస్తుంది. వెలుతురు సెకనుకు 1,82,000 మైళ్లవంతున ప్రయాణం చేస్తుంది. ఈ విధంగా మనకు దగ్గరలో ఉండే నక్షత్రంనుండి వెలుతురు భూమిని చేరడానికి $3\frac{1}{2}$ సంవత్సరాలు అవుతుంది. దీనివలన ఆకాశంయొక్క, కాలంయొక్క అనంతత్వము తెలియుచున్నది. వస్తువులన్నీ ఒకటితో ఒకటి కలిపి ఒకేచోట ఉండడం అనే సమవ్యాప్తిని ఆకాశం సూచిస్తుంది. ఒకటి తరువాత ఒకటి జరుగు కార్యాల

మన శరీరం ప్రకృతితో నిర్మింపబడినదనీ, ప్రకృతికన్నా మనం భిన్నమనీ తెలిసికోవడానికి మనం ప్రకృతి లేక అచిత్తును గూర్చి చదువుతాము. శరీరం పృథివి, అప్, తేజస్. వాయువు, ఆకాశము అనే పంచభూతాలతో సృష్టింపబడింది. దేహంలో ఐదు జ్ఞానేంద్రియా లున్నాయి. ఈ దేహానికి స్థూలశరీర మని పేరు. ఇది కాక సూక్ష్మ శరీర మొకటి ఉంది. దీనిలో మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము ఉన్నాయి. పాశ్చాత్యుల మనోవిజ్ఞానశాస్త్రప్రకారం మనో, బుద్ధి, చిత్త, అహంకారము లన్నిటికీ కలిపి మనస్సు అనే ఒకే పేరున్నా హైందవ మతంలో మనో బుద్ధి చిత్త అహంకారాలు సూక్ష్మరూపంలో ఉన్న భౌతిక వికారాలుగా చెప్పబడినాయి. అహంకార మంటే 'ఇది నాది' 'ఇది నేను' అని తనను గూర్చి చెప్పకొనడము. బుద్ధి అంటే నిశ్చయ జ్ఞానము. మనస్సు, చిత్తము అనేవి హృదయంలో పుట్టి నశించే మనో వస్థలు, ఇట్లు శరీరం సూక్ష్మము, స్థూలమైనది కాబట్టి దీనిని మానసిక భౌతిక ద్వయాత్మకమని చెప్పవచ్చును.

సాంఖ్యదర్శనం ప్రకారం ప్రకృతిలో 24 తత్త్వాలున్నాయి. అవి ఏవంటే మహత్తు, బుద్ధి, చిత్తము, అహంకారము, ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు, పృథివ్యాది పంచభూతాలు, పంచతన్మాత్రలు. ప్రకృతిలో సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణా లున్నాయి. పైన చెప్పిన ఇరవై నాలుగు తత్త్వాలలో ఈ మూడు గుణాలు ఏదో ఒక నిష్పత్తిలో మారుతూ ఉంటాయి.

మతానికీ తత్త్వశాస్త్రానికీ మధ్య, అందులో ముఖ్యంగా భారతీయుల మతానికీ తత్త్వశాస్త్రానికీ మధ్య, ఇదే భేదము అని చెప్పడం చాలా కష్టము. మతం కొన్ని సూత్రాలను, కర్మకాండను చెప్పుతుంది. తత్త్వశాస్త్రం జగత్తు ఆత్మ, ఈశ్వరుడు వీటి స్వరూపము, తత్త్వము, పరస్పర సంబంధాలను గూర్చి వివరిస్తుంది. ఒకటి వ్యవహార యోగ్యమైనది. మరొకటి వ్యవహార యోగ్యం కానిది. కాని మన పూర్వులు మొదటినుండీ తాత్త్విక చింతన కలవారు కాబట్టి తత్త్వశాస్త్రాన్నికూడా వ్యవహారంలోనికి తెచ్చుకొన్నారు. మన మతం తత్త్వశాస్త్రం ఒకటితో ఒకటి కలిసిపోయినాయి కాబట్టి మతాన్ని విశదీకరించే సమయాల్లో తత్త్వశాస్త్రం కూడ చోటు చేసుకొంటుంది. తత్త్వశాస్త్రంలోని పరతత్త్వమే మతంలో చెప్పబడిన మహోన్నత దైవం (ఈశ్వరుడు) అని, కాబట్టి పరతత్త్వానికీ ఈశ్వరునికి అభేదమనిచెప్పి తత్త్వశాస్త్రాన్ని ఈశ్వరవాదంగా వివరిస్తారు. కాబట్టి మన మతం ప్రజల ఆధ్యాత్మికాపేక్షలను తీర్చి వారికి మానసిక తృప్తిని కలుగజేస్తుంది.

తత్త్వశాస్త్రం జగత్తు, ఆత్మ, ఈశ్వరుడనే మూడు తత్త్వాల స్వరూపాన్ని వాటి పరస్పర సంబంధాన్ని గురించి చర్చిస్తుందని ముందే చెప్పితిమి. అంతేకాక మరణానంతర జీవితం భౌతికదేహాన్ని వదలిన తరువాత ఆత్మ (జీవుని) యొక్క పరిస్థితి, మోక్షస్వరూపం మొదలైన విషయాలు కూడా తత్త్వశాస్త్రంలో చర్చింపబడుతాయి. ఆత్మ ఈ ప్రపంచంనుండి మరొక ప్రపంచానికి ప్రయాణించడంకూడ తత్త్వశాస్త్ర పరిధిలోనికి వస్తుంది. ఆత్మయొక్క సంచారం (ప్రయాణం) పునర్జన్మకు, దానికి కారణమైన కర్మ మొదలైన విషయాల చర్చకు దారితీస్తుంది. ఈ విధంగా పరస్పరసంబద్ధములైన విషయాలు. సమస్యలు తత్త్వశాస్త్రంలో చర్చింపబడి వేర్వేరు దార్శనికులచేత

తత్త్వశాస్త్రాలు మన దేశంలో పుట్టినాయి. వాటిలో ముఖ్యమైనవి ఆరు. వాటిని షడ్దర్శనా లంటారు.

ఈశ్వరు డున్నాడని చెప్పడానికి, నమ్మడానికి మనకు వేదము ముఖ్యమైన ప్రమాణము. ఎందుకంటే ఈశ్వరుని ఇంద్రియాలతో తెలిసికోవడానికి వీలుపడదు. అనుమాన ప్రమాణంతో ఈశ్వరాస్తిత్వాన్ని తెలుసుకొనడం కుదరదు. కొన్ని దర్శనాలు వేదప్రామాణ్యాన్ని అంగీకరింపకుండా ప్రత్యక్ష, అనుమాన ప్రమాణాలమీదనే ఆధారపడుతాయి. కాబట్టి ఆ దర్శనాల్లో ఈశ్వరునికి స్థానం లేదు. చార్వాక, జైన, బౌద్ధ మతాలు ఈ తరగతికి చెందినాయి. వీటికి నాస్తిక మతా లని పేరు. వాటిని మన మిక్కడ చర్చింప పనిలేదు.

## ప్రాచీన దర్శనములు

సాంఖ్య, యోగ, వైశేషిక, న్యాయ, పూర్వమీమాంస, ఉత్తర మీమాంస అనే ఆరు ఆస్తికదర్శనాలు. అంటే వేదప్రామాణ్యాన్ని అంగీకరింపవు. సాంఖ్య యోగ దర్శనాలలోని ముఖ్య బోధనలలో సాదృశ్యం ఎక్కువగా ఉండడం వల్ల అవి ఒక జంటగా చెప్పబడుతున్నాయి. ప్రకృతి పురుషుని కంటే స్వతంత్రమైనది. ఇది ప్రపంచ సృష్టికి కారణము. పురుషుడు నిత్యుడు. ప్రకృతి సత్త్వరజస్తమో గుణాలతో ఏర్పడినది. ప్రళయకాలంలో ఈ మూడు గుణాలు సమస్థితిలో, సృష్టికాలంలో విషమ స్థితిలో ఉంటాయి. పురుషుని సమీపంలో ఉన్నప్పుడు ప్రకృతినుండి పుట్టినదే బుద్ధి. దీనికి మహత్, అంతఃకరణము అని నామాంతరములు. పురుషుడు బుద్ధియొక్క క్రియాశీలత్వాన్ని తనదిగా ఊహించి ఆత్మ (జీవుడు) అవుతాడు. ఈ ఆరోపణమే

భేదమున్న దని తెలిసికొన్నప్పుడు జనన మరణ భూయిష్ఠమైన సంసారం నశిస్తుంది. దీనినే ముక్తి అంటారు. సాంఖ్య దర్శనం ఈశ్వరాస్తిత్వాన్ని అంగీకరింపదు. యోగదర్శనం ఈశ్వరుణ్ణి అంగీకరించినా ఈశ్వరునికి ప్రపంచాన్ని సృష్టించే శక్తి మొదలైన గుణాలు లేవని చెప్పుతుంది. ముక్తి అంటే కైవల్యదశలో ఉండడం, అంటే ప్రకృతికంటే స్వతంత్రంగా ఉండడం అని అర్థము.

చిత్తవృత్తిని నిరోధింపవలెనని దానివలన ప్రకృతి పురుషుల మధ్య ఉండే భేదం తెలుస్తుందనీ ఇది సిద్ధించడానికి కొన్ని అభ్యాసాలను అలవాటు చేసికొనవలెననీ యోగదర్శనం బోధిస్తుంది. ఆ ప్రకారం అలవాటు చేసికోవలసిన అభ్యాసాలు ఏవంటే యమము (ఇంద్రియనిగ్రహము), నియమము (మనోనిగ్రహము), ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము ధ్యానము, ధారణము, సమాధి (మనోలయము).

న్యాయవైశేషికాలు ముఖ్య విషయాలలో ఏకీభావం కలిగి ఉండడంవల్ల ఆ రెండింటినీ కలిపి జంటగా చెప్పవచ్చును- జగత్తు అణువులతో సృష్టింపబడింది. ఇది ఈశ్వరనిర్మితము, యథార్థమైనది. జీవములు అసంఖ్యాకములు. నైయాయికులు (న్యాయదర్శనమును) అవలంబించువారు. అనుమానప్రమాణంతో ఈశ్వరాస్తిత్వాన్ని నిర్ణయిస్తారు. జగత్తు అవయవసముదాయంతో నిర్మింపబడినదనీ అది ఘటం వలె ఒక (కారణముయొక్క) కార్యమని అంటారు. సృష్టింపబడిన ప్రతి వస్తువుకూ ఒక కర్త ఉంటాడు. కర్తకు కార్య కారణాలు

... కాబట్టి జగత్తును నిర్మించిన కర్త ఒకరు తప్పక ఉండి తీరవలెను. ఈ కర్త పరిమితజ్ఞానముకల కర్మబద్ధమైన జీవులకంటే మిన్నగా ఉండి తీరవలెను. నిత్యగతికమైన కర్మవల్ల జీవులు సంసారంలోని సుఖ దుఃఖాల ననుభవిస్తున్నారు. ఈశ్వరుని సంతోషపెట్టడానికి ఫలాపేక్ష విడిచి కొంతమంది జీవులు విహితకర్మల నాచరిస్తూ ఈశ్వరానుగ్రహంవల్ల యోగాభ్యాసానికి కావలసిన శక్తిని పొంది యోగమువల్ల నిత్యమైన దుఃఖమోచనాన్ని పొందుతారు. ఈ దుఃఖమోచనమే న్యాయ వైశేషిక దర్శనాలలో చెప్పబడిన మోక్షము. మోక్షప్రాప్తి తరువాత సుఖ దుఃఖాలు గాని జ్ఞానప్రాప్తి గాని ఉండవు. ఇటువంటి మోక్షాన్ని పాషాణముక్తి అని కొందరంటారు.

న్యాయదర్శనం యొక్క గొప్పతనం, నవ్య న్యాయంలో వికాసం పొందిన సూక్ష్మవస్తు వివేచనంలో ఇమిడి ఉంది. నవ్యన్యాయం పరతత్త్వ చర్చకు ప్రాముఖ్యాన్ని ఇవ్వకుండా హేతుబద్ధమైన జ్ఞానాన్ని చర్చించే శాస్త్రీయ దర్శనంగా రూపొందినది. ఈ దర్శనంలో ప్రమాణ విచారానికి ప్రాముఖ్యం ఇవ్వబడింది. ప్రమాణాలలో అనుమాన ప్రమాణం సూక్ష్మతరభేదాలతో మిక్కిలి వివరంగా చర్చించబడింది. వేదము ఈశ్వరప్రోక్తం కావడంవల్ల అది అమోఘమనీ, అందుకే దానిలో భ్రమ, ప్రమాదాలు లేవనీ కాబట్టి వేదము ప్రమాణమైనదనీ నైయాయికు లంటారు.

వేదవిహిత కర్మలను తప్పక ఆచరింపవలెనని పూర్వమీమాంసా దర్శనం నిర్దేశిస్తుంది. కర్మయొక్క గతి నిత్యమైనది కాబట్టి జనన మరణాలతోకూడిన సంసారం కూడ నిత్యము. ప్రపంచములో సృష్టి, నాశము అనేవి లేవు. వేదనిషిద్ధమైన కర్మలను ఆచరించేవారు క్రిమి.

షించి కర్మలను చేసేవారు తిరిగి తిరిగి జన్మల నెత్తుతారు. వేదోక్తమైన ధర్మాన్ని ప్రతిఫలాపేక్ష లేకుండా ఆచరిస్తే ధర్మం అపూర్వాన్నిస్తుంది. అది కర్మతో కల సంబంధాన్ని త్రుంచి ఆత్మసాక్షాత్కారాన్ని కలుగజేస్తుంది. ఇదియే పూర్వమీమాంసాదర్శనంలో చెప్పబడిన మోక్షము. ఈ దర్శనం కర్మఫలాన్నిచ్చే ఈశ్వరుని ప్రత్యేకంగా ఒప్పుకోదు. సాంఖ్య, యోగ, పూర్వమీమాంసామతాల్లో జీవులు అసంఖ్యేయులు. అవి నిత్యములు, అవి అన్నింటా ఉంటాయి. ఈ మూడు దర్శనాలవారు జీవుల కోర్కెలు తీర్చే ఈశ్వరుని అంగీకరింపరు. పూర్వమీమాంసామతంలో వేదములు నిత్యములు, అపౌరుషేయములు. వేద విహితకర్మలను ఆచరింపకపోవడం వల్ల పాపాలు కలుగుతాయి.

షడ్దర్శనాలలో సర్వజనసమ్మతము, సర్వసాధారణము అయినది ఉత్తరమీమాంసాదర్శనము. దీనికి వేదాంతమనే మరోపేరు ఉంది. న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, పూర్వ, మీమాంసా శాస్త్రాలు కూడా ఉత్తరమీమాంసతో పాటు దర్శనాలుగా చెప్పబడినా వాటికి నేడు అధ్యయన ప్రయోజనం మాత్రమే ఉంది. ఈ దర్శనాలకు సంబంధించిన సూత్రాలను నిత్యజీవితంలో ఉపయోగించే అనుయాయులు ఎవ్వరు లేరు. కాబట్టి వేదాన్తాన్ని సజీవమైన తత్త్వశాస్త్రమని చెప్పవచ్చును. వేదముల చివరిభాగాలైన ఉపనిషత్తులలో చెప్పబడిన బోధనలమీద ఆధారపడినవి. కాబట్టి ఉత్తరమీమాంసా దర్శనానికి వేదాన్త దర్శనమని పేరు. ధర్మాచరణాన్ని విధించే పూర్వమీమాంసా శాస్త్రం వేదాలలోని పూర్వభాగాలైన బ్రాహ్మణములమీద ఆధారపడగా వేదాన్తము వేదాల చివరభాగాలమీద ఆధారపడినది. కాబట్టి వీటికి

ఉపనిషత్తులలో చేయబడిన తత్త్వబోధలన్నీ ఉదాహరణకథలు లేకుండా సంగ్రహంగా సరళమైన భాషలో మహాభారతాంతర్గతమైన భగవద్గీతలో చెప్పబడినాయి. కాబట్టి హైందవమతం, తత్త్వశాస్త్రం ఉపనిషత్తులలోని రహస్యాలను తెలిసికొనడానికి అశక్తులైన లౌకికులకు కూడ భగవద్గీత మిక్కిలి ఉపకరిస్తుంది. శ్రీకృష్ణుడు అర్జునునకు కురుక్షేత్రమనే యుద్ధభూమిలో కర్మ, జ్ఞాన, భక్తి, యోగాలను బోధించినాడు. తత్ఫలితంగా రాగద్వేషరహితంగా అర్జునుడు యుద్ధం చేసి ప్రపత్తి మార్గంలో శ్రీకృష్ణపరమాత్మ సన్నిధికి చేరుకొన్నాడు.

ఉపనిషత్తులలో చెప్పబడిన తాత్త్వికబోధనలన్నీ వ్యాసునిచేత క్రమబద్ధం చేయబడి బ్రహ్మసూత్రాలలో ప్రవచింపబడినాయి. బ్రహ్మసూత్రాలనేవి వేదాన్తములో ప్రధానమైనగ్రంథము. వీటిని భిన్న భిన్న వ్యాఖ్యాతలు విభిన్నరీతులలో వ్యాఖ్యానించడంవల్ల వేదాన్తశాస్త్రంలో ఎన్నో సంప్రదాయాలు ఏర్పడినాయి. వీటిలో ముఖ్యమైనవి అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము, పాశుపతము మొదలైనవి. శ్రీ శంకరాచార్యులు అద్వైతానికి, శ్రీ రామానుజులు విశిష్టాద్వైతానికి శ్రీ మధ్వాచార్యులు ద్వైతానికి, శ్రీకంఠుడు పాశుపతానికి ముఖ్య ప్రతినిధులు.

అద్వైతమతంలో బ్రహ్మము మాత్రం సత్యము, జ్ఞాత, జ్ఞానం ఈశ్వరుడు, జగత్తు - ఇవి అన్నీ మిథ్య లేక అసత్యము. శుద్ధచైతన్యమే బ్రహ్మము, అది నిర్విశేషము (గుణములు లేనిది). నిర్విశేషమంటే సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహితంగా ఉండడము. చిద్రూపులైన బ్రహ్మమునకు, జీవునికి యథార్థంగా భేదం లేదు. మాయలో ప్రతిఫలించిన బ్రహ్మమునకు ఈశ్వరుడనీ, అవిద్యలో ప్రతిఫలించిన బ్రహ్మమును జీవుడనీ అంటారు. బ్రహ్మము, నిత్యము, శాశ్వతమైనది.

తమ యథార్థతత్త్వాన్ని అవగతం చేసికోనలేక పలువిధములైన భ్రాంతులకు లోనవుతారు. యథార్థస్థితిలో జీవునికి, బ్రహ్మమునకు భేదము లేదు. బ్రహ్మమే చైతన్యము, సత్యము, ఆనందమగుటవల్ల ఈ మూడు బ్రహ్మమునకు ధర్మములు (గుణములు) కావు. కావున బ్రహ్మముకన్న భిన్నము కావు. సంసార మనేది అవిద్యచేత కల్పించ బడిన భ్రాంతి. 'తత్త్వమసి' ఇత్యాది మహావాక్యములచేత కలిగే జ్ఞానం వల్ల అవిద్య తొలగిపోతుంది.

అవిద్యా నివృత్తియే మోక్షము. సాయంసమయములో వంకర టింకరగా నేలమీద పడి ఉండే త్రాటిని చూచి సర్పమని భ్రమించ డాన్ని రజ్జుసర్పభ్రాంతి అంటారు. అజ్ఞానంచేత జీవులకు కల్పించ బడిన భ్రాంతి ఇటువంటిదే. అసత్యమైన సర్పము సత్యమైన త్రాటిలో ఆరోపింపబడింది. కాని ఈ భ్రమజన్యజ్ఞానము "ఇది సర్పము కాదు ఇది త్రాడు" అనే యథార్థజ్ఞానప్రాప్తితో నశిస్తుంది. మోక్షాన్ని పొందడానికి కోరిక కలవారికి వివేకము, వైరాగ్యము, శమ, దమాది సంపద, తప్పక ఉండవలెను. అంటే మోక్షాన్ని కోరేవారు బ్రహ్మము మాత్రమే సత్యము, మిగిలినదంతా అసత్యము అని గ్రహింపవలెను. సర్వసంగపరిత్యాగముచేసి ఆత్మసంయమనం మోక్షేచ్ఛ కలిగి ఉండవలెను. జ్ఞానం వల్ల మాత్రమే ముక్తి కలుగుతుంది. కర్మ, భక్తి ఇవి జ్ఞానానికి సహకారులు మాత్రమే. బ్రహ్మజ్ఞానం కలిగినవెంటనే జీవునికి దేహమున్నప్పటికీ ముక్తి కలుగుతుంది. అప్పుడతనిని జీవన్ముక్తు డంటారు. ఇది అద్వైత మతములోని ప్రత్యేకత. ఇతర మతాలు జీవన్ముక్తిని అంగీకరింపక జీవుడు కర్మజన్యమైన దేహాన్ని త్యజించిన తరువాతనే ముక్తిని పొందుతాడు అని చెప్పుతాయి.

భాస్కర, యాదవప్రకాశులనే వారిచేత స్థాపింపబడి వారిపేరిట వెలసిన రెండు మతాలు ఉన్నాయి. భాస్కరమతంలో బ్రహ్మము

మొదలైన రూపాలను ధరిస్తాడు. ఉపాధులుండే బ్రహ్మముయొక్క అంశాలే జీవులు. బ్రహ్మము ఆకాశంవలె అభేద్యము, కాని ఘటము చేత అవచ్ఛిన్నమైన ఆకాశం ఘటాకాశ మని పిలువబడినట్లు పై చెప్పబడిన ఉపాధులచేత బ్రహ్మము జీవు డనిపించుకొనును. బ్రహ్మము యొక్క ఉపాధులవల్ల కలిగిన అవధినే "సంసారము" అని అంటారు. నిరంతర బ్రహ్మధ్యానంవల్ల కలిగిన యథార్థజ్ఞానం చేత ఉపాధులు తొలగుతాయి. జ్ఞానకర్మసముచ్చయంవల్ల జీవబ్రహ్మైక్యజ్ఞానం కలుగుతుంది. ఉపాధులు తొలగిన తరువాత కలిగే జీవబ్రహ్మైక్యాన్ని మోక్షమని అంటారు.

యాదవప్రకాశుని మతంలో యథార్థ పరిణామమువల్ల బ్రహ్మమే చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అనే రూపాలను పొందును. చిత్తు అంటే జీవుడు, అచిత్తు అంటే దేహము, ఇంద్రియాలు మొదలైనవి. ఈశ్వరుడే అన్నింటిని నియంత్రణ చేస్తాడు. జీవునికి ఈశ్వరునితో కల అభేదము జీవునికి తెలియదు. ఈ భేదజ్ఞానమే సంసారము. సత్కర్మలను ఆచరించడంవల్ల, ఈశ్వరకృపచేత సంసారబంధాలను తొలగించుకొనవచ్చును. యథార్థజ్ఞానం బ్రహ్మైక్యానికి, ముక్తికి మార్గమవుతుంది. అయినప్పటికీ బ్రహ్మము, జీవము, జగత్తులమధ్య భేదం అభేదం ఉన్నాయి.

విశిష్టాద్వైతమతంలో చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు-ఈ మువ్వురూ నిత్యులు. వీటిలో చిత్తు, అచిత్తు అనేవి ఈశ్వరుని యొక్క ప్రకారాలు, లేక ప్రత్యేక గుణాలు (ధర్మాలు). ఈశ్వరునికి ఈ ప్రకారాలు ఉన్నాయి కాబట్టి ఆయనకు 'ప్రకారి' అని పేరు. దేని సహాయంవల్ల దాని ఆధారము తెలియబడునో దానికి "ప్రకారము" అని పేరు. ప్రకారి వేరుగా ప్రకారము ఉండదు. కాబట్టి చిదచిత్ విశిష్టుడైన బ్రహ్మము

స్వభావంలో భేదం ఉన్నది. అచిత్తు శుద్ధసత్త్వము, మిశ్రసత్త్వము, సత్త్వశూన్యమని మూడువిధాలు. శుద్ధసత్త్వము స్వయం ప్రకాశమైనది. దీనికి పరమపద మని పేరు. కాలము సత్త్వశూన్యము, కాని ఆకాశంవలె నిత్యము. మిశ్రసత్త్వము సత్త్వ, రజస్, తమో గుణాలను తోనై ప్రకృతి, మహత్, అహంకారము, పంచతన్మాత్రలు ఇంద్రియాలు మొదలైన 24 తత్త్వాలుగా రూపొందుతుంది. జీవుల పురాతన కర్మననుసరించి అది జీవులయొక్క శరీరము, అహంకారము అవుతుంది. మమకార అజ్ఞానాలచేత దేహధారణ చేసిన జీవుల జనన మరణ పరంపరలకే సంసార మని పేరు. అవిద్యా, కర్మల వలయంలో ఉన్న కొందరి పాపాలు వారి పుణ్యాలవల్ల నశిస్తాయి. వారు అప్పుడు ఈశ్వరుని ముక్తి కొరకు ప్రార్థిస్తారు. ఈశ్వరానుగ్రహంతో లభించిన గురువుయొక్క బోధనలతో శాస్త్రాలలోని సమ్యగ్జ్ఞానాన్ని పొందుతారు. నిత్య నైమిత్తిక కర్మలను తమ దశను, స్థితిని అనుసరించి యథావిధిగా ఆచరిస్తూ శమము, దమము, తపస్సు, శౌచము, క్షమ, ఆర్జవము, భయము, అభయము, స్థానము, వివేకము, అహింస, దయ మొదలైన ఆధ్యాత్మికగుణాలను సంపాదిస్తారు. ఈశ్వరుని శరణుపొంది భక్తిచేత శాస్త్రాన్ని మననం చేసికొంటూ, ఈశ్వర గుణాలను ధ్యానంచేస్తూ ఈశ్వరకృపతో అజ్ఞానాన్ని పోగొట్టుకొంటారు. వారు భక్తియోగాన్ని అభ్యసించి దేహత్యాగసమయంలో ప్రపత్తివల్ల ఈశ్వరానుగ్రహంవల్ల ముక్తిని పొందుతారు. కైవల్యము, ఈశ్వర ప్రాప్తి అని ముక్తి రెండు విధాలు. కైవల్యమంటే ఆత్మసాక్షాత్కారం వల్ల కలిగే ఆనందానుభవము. పరమపదంలో ఈశ్వరుని చేరి ఈశ్వర స్వరూపాన్ని, శాశ్వతానందాన్ని అనుభవించడం మరొకవిధమైన ముక్తి. ఈశ్వరుడు పరమపదంలో ప్రత్యేకమైన దివ్యమంగళరూపాన్ని కలిగి ఉంటాడు. ఆయన తన కృపకు పాత్రులైన తన ప్రియురాండ్రు శ్రీదేవి భూదేవి, నీలాదేవులతోను, నిత్యముక్తులైన అనంత, గరుడ, విష్వక్సే

జీవులను కూడ కర్మవిముక్తులుగా చేసి వారిని తనతో సామ్యము కలవారినిగా చేస్తాడు.

విశిష్టాద్వైతమతంలో విష్ణువు లేక నారాయణుడు లేక వాసుదేవుడు లేక వేంకటేశ్వరుడు పరబ్రహ్మ. మానవులను కష్టాలనుండి తప్పించ డానికిఆయన కొన్ని అవతారా లెత్తుతాడు. భక్తులకోర్కెల ననుస రించి దయామయుడైన ఈశ్వరుడు (పరబ్రహ్మ) శాశ్వతంగా అర్చా (లేక విగ్రహ) రూపంలో వెలుస్తాడు. అందుకే విష్ణువు (వాసుదేవుడు) స్వయంగా తిరుమల మందిరంలో వెలసినాడని విశిష్టాద్వైతమతం చెప్పుతుంది. కాబట్టి తిరుపతిని కలియుగ వైకుంఠమని చెప్పడంలో అతిశయోక్తి లేదు. దేహానికి, జీవునికి ఉండే శరీరశరీరి భావసంబంధమే జీవునికి ఈశ్వరునికి ఉన్నది. ప్రపంచంలోని అన్ని పదార్థాలకు ఈశ్వరుడు అంతరాత్మ. చివరకు నామరూపాలన్నీ సర్వజీవులకు ఆత్మ యైన పరబ్రహ్మ శ్రీనివాసునకే అన్వయిస్తాయి.

ద్వైతమతంలో చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అనే మూడు తత్త్వాలు ఉన్నాయి. ఈశ్వరుడు జగత్తునకు నిమిత్త లేక ఉపాదాన కారణం మాత్రమే. విష్ణువే ఈశ్వరుడు. ఆయనకు సమస్తకల్యాణ గుణాలు ఉన్నాయి. ఆయన దేహము ఆనందము, జ్ఞానము మొదలైన వాటిచేత నిర్మింపబడినది. జీవులు, జగత్తు ఆయనమీద ఆధారపడి ఉన్నాయి. జీవుల పరిమాణంలో అత్యంత సూక్ష్మములైనవారు వారు పరస్పరభిన్నంగా ఉంటారు. గుణాలను అనుసరించి జీవులు తమో యోగ్యులు, నిత్యశరీరులు, ముక్తియోగ్యులు అని మూడు తరగతు లుగా ఉంటారు. మొదటి తరగతికి చెందిన జీవులు శాశ్వతంగా నరకంలో పడి ఉంటారు. చివరి తరగతివారు నిత్యముక్తులు, కాబట్టి

కర్మ ఫలత్యాగంతో ప్రారంభించి విష్ణుధ్యానంవరకు గల కొన్ని అభ్యాసాలను సాధనచేసి ముక్తుల సుఖాలను అనుభవించి ప్రత్యక్షంగా ఈశ్వరుని తెలిసికొంటారు. రాగద్వేషాదులనే వాసనలు దూరమైనప్పుడు, వారు ముక్తినిపొంది బ్రహ్మానందాన్ని అనుభవిస్తారు. ఈశ్వరునికి జీవునికి కల సంబంధం స్వామి, దాస సంబంధంవంటిది. కాబట్టి ద్వైతమత సిద్ధాంత ప్రకారం ఇహ పరలోకాలలో ఈశ్వరుని సేవించడమే జీవితం యొక్క పరమార్థము.

పాశుపత సిద్ధాంతంలో పతి (ఈశ్వరుడు), పశువు (జీవుడు), పాశము (ప్రకృతి) అనే నిత్య తత్త్వాలున్నాయి. ఈశ్వరుడు పరమపతి లేక పరమేశ్వరుడు. ఈ జగత్తుకు ఈశ్వరుడు నిమిత్తకారణం, అణువులు ఉపాదానకారణము. జీవుడు ఈశ్వర, ప్రకృతులకన్నా భిన్నుడు. కాని తనను తాను తెలిసికొంటాడు. అతడు స్ఫటికంవలె సంసర్గంపొందిన వస్తువుయొక్క రూపాన్ని పొందుతాడు. ఆణవ, మాయా, కామ్యము (అంటే అజ్ఞానము, జడత్వము, కోర్కె)ల చేత సిద్ధించిన పాశము (ప్రకృతి) లో తగుల్కొని నప్పుడు అతడు సంసార నిమగ్నుడౌతాడు. జీవుడు పతి (ఈశ్వరుని) తో సంసర్గం పొందినప్పుడు పరమేశ్వరునివలె అవుతాడు. కొన్ని అభ్యాసాలవల్ల మాయ (అవిద్య) మొదలైనవి నశించి ముక్తిని పొందుతాడు. ఈ మతంలో ముక్తి అంటే శివసారూప్యాన్ని పొందడమే, కాని శివైక్యాన్ని పొందడం కాదు. శివుడంటే వాత్సల్యం, ప్రేమ. శివుడు జీవులను మలినాల (పాపముల) నుండి తప్పిస్తాడు. శివుని, శివభక్తులను సేవించడమే జ్ఞానంయొక్క పరమోత్కృష్ట రూపము.

[illegible] అర్పించి ఆయనలో లీన మవుతుంది. జ్ఞానము, భక్తివలన జీవుడు ముక్తినిపొంది శివైక్యాన్ని పొందుతాడు. శాక్తమతంలోని కొన్ని శాఖలవారు మధ్యభారతంలో ఈశ్వరుణ్ణి ఆరాధించడం శ్మశాన భస్మాన్ని దేహమంతా పూసికొనడం మొదలైన అవైదికాచారాలను అవలంబిస్తారు.

## మధ్యయుగము నాటి మతములు

భక్తి, ప్రపత్తి సిద్ధాంతాలతో కూడిన విశిష్టాద్వైతమతం వర్ణ, లింగ, వివక్షతలేకుండా భక్తులు, ప్రపన్నులు, అందరూ సమానులే అని గట్టిగా నొక్కి చెప్పడంవల్ల ఆ మతం ప్రజలహృదయాలను ఆకర్షించి భారతదేశమంతా వ్యాపించింది. ఉత్తరభారతదేశంలో చాలా మంది భక్తులు ఈ మతాన్ని ప్రచారం చేయడానికి ముందుకు వచ్చి నారు. కాని వారి బోధనలు తమ తమ ఇష్టాలకు భావాలకు, అను గుణమైన పద్ధతులలో బయలుదేరినాయి. నారాయణుడే పరమాత్మ లేక పరబ్రహ్మ అనే విశిష్టాద్వైతసిద్ధాంతం ఉత్తరభారతదేశ సాధు వుల మనస్సుల నాకర్షించడంవల్ల వారు తమ మనఃప్రవృత్తికి ఇష్ట మైన రూపాలలో నారాయణునికి ఐక్యము కల్పించినారు. భక్తులు పరమాత్ముని రూపంలో పూజిస్తే ఈశ్వరుడు ఆ రూపంలో వారికి ప్రత్యక్షమై వారిని భక్తులుగా అంగీకరిస్తాడు.

ఇటువంటి సాధుపుంగవులలో రామానందయోగి ప్రథముడు. ఇతడు ఈశ్వరుడు, ప్రతిజీవునిలో ఉన్నాడనీ, ధర్మాత్ముడైన రాముడే పరమాత్మ అని బోధించినాడు. హైందవేతరులైన మహమ్మదీయులు కూడ రామానందుని భక్తులు కావడాన్నిబట్టి రామానందుని వ్యక్తిత్వా నికీ బోధనలకూ ఉండే ఆకర్షణ, ప్రభావాలను ఊహించుకొనవచ్చును.

కబీర్ అనే భక్తుడు ఈ సిద్ధాంతాలను అనుసరించి, ఇస్లాం మతసిద్ధాంతాలతో ఈ సిద్ధాంతాలను మేళవించి "కబీర్‌పంథి" అనే మార్గాన్ని స్థాపించినాడు.

శ్రీకృష్ణుడే పరబ్రహ్మమనీ ఆయనస్వరూపం ఆధ్యాత్మిక ప్రేమతో కూడినదనీ ఆ ప్రేమయే రాధాకృష్ణుడనీ వల్లభుడు బోధించెను. శ్రీకృష్ణుడు గోకులంలో క్రీడిస్తూ ఉంటాడు. ఈశ్వరలీలయే జగత్సృష్టి. శ్రీకృష్ణుని చేందానికి భక్తి ఒకటే సాధనము. భక్తి అంటే అణచుటకు వీలులేని ప్రేమలేక పుష్టి. దేహంనుండి ముక్తుడైన తరువాత జీవుడు వైకుంఠానికి అవతల ఉండే గోకులాన్ని చేరి, శ్రీకృష్ణునితో ఐక్యము పొందడంవల్ల కలిగిన ఆనందాన్ని అనుభవిస్తాడు.

చైతన్యుడు రాధాకృష్ణ సంప్రదాయాన్ని బోధించెను. పరబ్రహ్మమైన శ్రీకృష్ణుడు తన ప్రియురాలైన రాధతో సదా క్రీడిస్తూ ఉంటాడు, తన మనోహరరూపంతో జీవులను ఆకర్షిస్తాడు. కృష్ణానందాన్ని పొందడానికి భక్తి లేక ప్రేమ ఒకటే సాధనము. శ్రీకృష్ణుని విషయంలో చూపదగిన ప్రేమభావాలను శ్రీకృష్ణుడు యజమానిగా, చెలికానిగా, పరిపాలకునిగా ఇంకా అనేకవిధాలుగా చూపవచ్చునని చైతన్యుడు బోధించినాడు. ఈ భావాలలో ముఖ్యమైనది శ్రీకృష్ణుని ఆధ్యాత్మిక వరునిగా భావించడము. కృష్ణప్రేమ వైకుంఠంలోని సుఖాలకన్న మిన్నయైనది.

## ఆధునిక మతోద్యమములు

బ్రహ్మసమాజము, ఆర్యసమాజము, రామకృష్ణాశ్రమము మతాంతరీకరణాన్ని అవలంబించిన విదేశీయమతాలయొక్క ప్రభావాన్ని

వేదాలు హైందవమతానికి ముఖ్యమైన ఆధారము. అవి బ్రహ్మము యొక్క వాక్కులు కాబట్టి బ్రహ్మమే అనబడతాయి. అవి మహర్షులచేత చెప్పబడినాయి. అవి ప్రపంచంలోని అతి ప్రాచీన మైన వాఙ్మయానికి మచ్చుతునకలవంటివి. వాటిలోని భాష ప్రాచీన సంస్కృత భాషా స్వరూపాన్ని తెలియజేస్తుంది. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అథర్వణవేదము అని వేదాలు నాలుగు. ప్రతివేదంలోను కర్మభాగము, తత్త్వభాగము అని రెండు విభాగా లున్నాయి. పుణ్యాన్ని (లేక ధర్మాన్ని) కోరేవారు అనుష్ఠింపవలసిన కార్యకలాపాలు కర్మభాగంలో వివరంగా చెప్పబడినాయి. బ్రహ్మ మును తెలిసికొనడంవల్ల సర్వమూ తెలుస్తుంది కాబట్టి బ్రహ్మమును వివరించే వేదభాగం చాలా ముఖ్యమైనది. దీనిని వేదాన్తము లేక ఉపనిషత్తులు అంటారు. కర్మభాగం మంత్ర బ్రాహ్మణాలని రెండు భాగాలుగా విభజింపబడింది. బ్రాహ్మణములు యజ్ఞ, యాగాదులను చేయు పద్ధతులను వివరించి ప్రతి కర్మను అనుష్ఠించడంలో ఉపయో గింపబడే మంత్రాలను నిర్దేశిస్తాయి. మంత్రభాగంలో మంత్రములు ఉపదేశింపబడినాయి. కాని ఈ రెండు భాగాలు కృష్ణయజుర్వేదంలో కలిసిపోయినాయి. మిగత వేదాలలో అవి ప్రత్యేకంగా ఉన్నాయి.

మహర్షులు వేదాలను తొలుత పఠించినా వారు వేదాలను రచించినారని చెప్పకూడదు. హైందవమతంలో వేదాలు నిత్యములు. అవి అన్ని కాలాల్లోను ఉంటాయి. వాటికి కాలావధిలేదు. వేదాలలో చెప్పిన దానికి అనుగుణంగా బ్రహ్మము ప్రపంచాన్ని సృష్టిస్తాడు. వేదాలు భిన్న భిన్న యుగాలలో ఈశ్వరునిచేతగాని, ఈశ్వరప్రేరిత మానవులచేతగాని మానవులకు అందజేయ బడుతున్నాయి. వేదాలు అపౌరుషేయాలు (మానవులచేత రచింపబడలేదు) కాబట్టి అవి అమోఘ

కార్యాలలో భ్రమ, ప్రమాదము ఉంటాయి గాని వేదాలలో ఉండవు. వేదాలలో చెప్పబడిన ఆజ్ఞలను, విధులను తప్పక మానవులంతా పాటించవలెను. వేదాలలోని భాషను దేవభాష అంటారు. వాటి భాషలోని భాషావిషయక నిదర్శనాలవల్ల వేదాల ప్రాచీనత్వం, పవిత్రత తెలుస్తాయి. వేదాలు చరిత్రకు అందనివి కాబట్టి అవి ప్రాగైతిహాసిక కాలం నాటివని చెప్పడానికి వీలు పడదు. చారిత్రకరీత్యా వాటి కాలాన్ని నిర్ణయించడానికి వీలుపడదు.

వేదాల చివరిభాగాలకు ఉపనిషత్తులు అనే పేరున్నా ఉపనిషత్తు లన్నీ వేదాల కనుబంధాలు కావు. ఐతరేయ, కౌషీతకి కఠ, తైత్తిరీయ. ఈశ, ఛాన్దోగ్యోపనిషత్తులు ముఖ్యమైనవి. వీటితోపాటు బృహదారణ్యక, శ్వేతాశ్వతర, ముండ, మాండూక్యమైత్రాయణీయ కేనోపనిషత్తులుకూడ ప్రమాణమైనవి. వీటిలో బృహదారణ్యకోపనిషత్తు శుక్లయజుర్వేదానికీ శ్వేతాశ్వతర మైత్రాయణీయోపనిషత్తులు కృష్ణయజుర్వేదానికీ, కేనోప నిషత్తుసామవేదానికీ, ముండమాండూక్యాలు అథర్వణవేదానికిచెందినవి. శ్వేతాశ్వతర, మైత్రాయణీయోపనిషత్తులు తప్ప మిగత పదింటికి దశోపనిషత్తులనిపేరు. ఇవి భారతీయ వేదాన్తానికి ప్రమాణగ్రంథాలు. వీటిని మతాచార్యులు తమ తమ వాదాలకు ఉపోద్బలకంగా తమ గ్రంథాలలో ఉదహరించినారు. ఇవికాక మనమతంలో ఉండే అంతర్వే దాలలోని ఆచారాలు, సంకేతాలకాధారమైన ఉపనిషత్తులు సుమారు నూరు ఉన్నాయి.

ఏ ఉపనిషత్తుకూడ ఏ దర్శనసిద్ధాంతాలను ప్రత్యేకించి చెప్పదు. ఆ యా దర్శనాలలో భిన్నభిన్న విషయాలపై జరిగిన చర్చలు ఉప నిషత్తుల రూపంలో వెలసినాయి. బాదరాయణుడు (వ్యాసుడు) వాటి సారాంశాన్ని క్రమబద్ధం చేసి బ్రహ్మసూత్రాలలో ఇమిడ్చినాడు. శ్రీశంకర, రామానుజ, మధ్వ, వల్లభాచార్యులు మొదలైన మతా

అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత, శైవమతాలు బయలు దేరినాయి. కొందరు మతాచార్యులు ఉపనిషత్తులకు కూడ వ్యాఖ్యానాలు రచించారు.

ఉపనిషత్తుల తరువాత ధర్మశాస్త్రాలు హిందూమతానికి ప్రమాణ గ్రంథాలు. ఇవి సూత్రములు, స్మృతులు అని రెండు విధాలు. సూత్రాలు సూత్రరూపంలోను, స్మృతులు పద్యరూపంలోను ఉన్నాయి. ఋషులకు ప్రత్యక్షంగా వెల్లడిచేయ బడినవి స్మృతులు. తొలుత ఋషుల చేత స్మరింపబడి గ్రంథస్థం చేయబడినవి స్మృతులు. సంఘంలోని వివిధవర్ణాలవారికి ప్రత్యేకంగాను, సామూహికంగాను అన్వయించే ఆచారకాండను (ప్రవర్తన నియమావళిని) ధర్మశాస్త్రం బోధిస్తుంది. ధర్మశాస్త్రాలలోని నైతిక, ధర్మవిషయాలన్నీ వేదాలనుండీ గ్రహింపబడినాయి. కాబట్టి వేదాలకంటే కొత్త విషయాలను ధర్మశాస్త్రాలు బోధింపవు. వేదాలలో చెప్పబడిన విషయాలకు, ధర్మశాస్త్రవిషయాలకు విరోధం సంభవిస్తే వేదం చెప్పినదానినే ప్రమాణంగా తీసికొనవలెను. వేదాలలో చెప్పబడని కొత్తవిషయాలు ధర్మశాస్త్రంలో ఉంటే ధర్మశాస్త్రాలను రచించినకాలంనాటికి ఆ విషయాలు వేదాలలో ఉండి ఉంటాయనీ, అందుకే వాటిని ధర్మశాస్త్రకారులు ధర్మశాస్త్రాలలో ఇమిడ్చినారనీ, కాని ఇప్పుడు ఆ వేదభాగాలు లుప్తములై ఉంటాయనీ మనం ఊహింపవలసి ఉంటుంది. "వేదాలలో చెప్పబడని కొత్త విషయాలున్నాయి కాబట్టి ఇవి ప్రమాణాలు కావు" అని ధర్మశాస్త్ర గ్రంథాలను తిరస్కరింపరాదు. ఇద్దరు ధర్మశాస్త్రకారులు ఒకే విషయాన్ని విభిన్నరీతులలో చెప్పిఉంటే వాటిని తిరస్కరింపకుండా వాటిలో ఏ ఒకదానినైన మన ఇష్టం మేరకు పాటింపవచ్చునని అర్థము. మన పూర్వులు ఆ రెండు సాంప్రదాయాలలో దేనిని

కల్పమనేది ఆరు వేదాంగాలలో ఒకటి. శిక్ష (స్వరశాస్త్రం), వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, కల్పం అనే ఆరును వేదాంగాలు. కల్పశాస్త్రం వైదిక గృహ్యకర్మలయొక్క పద్ధతులను, సమస్తమానవులకు ఉద్దేశింప బడిన ధర్మాన్ని బోధిస్తుంది. మనకు లభిస్తున్న ధర్మసూత్రాలన్నీ కల్పసూత్రాలయొక్క అంతిమభాగాలు కావు. కొందరు ఋషులు కల్పసూత్రాల భాగాల నన్నింటినీ వ్రాయగా కొంతమంది కల్పసూత్రాల లోని కొన్ని భాగాలను మాత్రమే వ్రాసిరి. ఆపస్తంబ, హిరణ్యకేశి, బోధాయన, వైఖానసులచేత రచింపబడిన ధర్మసూత్రాలు మొదటి తరగతికి చెందినవి. గౌతమ, వసిష్ఠ కృత ధర్మసూత్రాలు స్వతంత్ర గ్రంథాలు. వీరిచేత రచింపబడిన కల్పసూత్రాలు మనకు లభించడంలేదు.

హిందూమతానుసారం మనుస్మృతి, పరాశరస్మృతి, వసిష్ఠస్మృతి, శంఖస్మృతి, లిఖితస్మృతి, అత్రిస్మృతి, విష్ణుస్మృతి, హారీతస్మృతి, యమస్మృతి, అంగిరసస్మృతి, ఉశనసస్మృతి, సంవర్తస్మృతి, బృహస్పతిస్మృతి, కాత్యాయనస్మృతి, దక్షస్మృతి, వ్యాసస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, శాతాతపస్మృతి అనే పద్దెనిమిది స్మృతులున్నాయి. ఇవన్నీ సమానప్రామాణ్యం కలవి. కాని సర్వవిషయ సమన్వితమవడం వల్ల సుబోధక దీర్ఘ వివరణం కలిగి ఉండడం వల్ల మనుస్మృతి మాత్రం ఇతరస్మృతి కర్తలచేత ఇతిహాసపురాణ కర్తలచేత చాల ఆదరింపబడి పరమ ప్రమాణంగా స్వీకరింపబడింది. కలియుగంలో పరాశరస్మృతి ప్రమాణము. కలియుగానికి అన్వయించే ప్రత్యేక సూత్రాలు, విబంధ నలు వివరంగా దీనిలో చెప్పబడినాయి. మనుస్మృతి కృతయుగానికి, గౌతమధర్మసూత్రాలు త్రేతాయుగానికి శంఖలిఖితస్మృతులు ద్వాపర యుగానికి, పరాశరస్మృతి కలియుగానికి వర్తిస్తాయని మనుస్మృతిలో చెప్పబడింది.

ప్రమాణమైన, ఋషిప్రోక్తమైన ఇతర గ్రంథాలు కొన్ని ఉన్నాయి. ఇతిహాసాలు, పురాణాలు, ఆగమాలు, తంత్రాలు ఈ శాఖకు చెందినవి. స్మృతులలో చెప్పబడిన ధర్మాలు, విధులు ఏ విధంగా భిన్న భిన్న వ్యక్తులచేత ఆచరింపబడుతున్నాయి. 'విధులు ధర్మాలమధ్య విరోధం కన్పిస్తే మానవు లెట్లు ప్రవర్తింపవలెను' అనే విషయాలను స్మృతులు వర్ణించి మానవులకు ధర్మాచరణంలో ప్రవృత్తిని, అధర్మాచరణంలో నివృత్తిని కలిగిస్తాయి. పురాణాలు రామ, కృష్ణాద్యవతారాలలో ఈశ్వరుడు మానవుని స్థాయికి దిగివచ్చి మానవులను ఏ విధంగా దివ్యత్వానికి చేర్చునో, వర్ణించి ఈశ్వరుని సర్వశక్తిమత్త్వాన్ని తెలియజేస్తాయి. అవి దీనికొఱకై ప్రపంచ సృష్టి, స్థితి, లయాలను, ధర్మాధర్మ ప్రజాపాలనావిధానాన్ని వర్ణిస్తాయి. ఆగమాల్లో దేవాలయ నిర్మాణం, అర్చామూర్తుల నిర్మాణం, వాటి సంస్కారాలు మొదలైనవి వివరింపబడినాయి. దేవతలను సులభంగా ప్రసన్నంచేసికొని తద్వారా ఇహ, పరలోకాల్లో సుఖాలను పొంది చివరకు యోగంవల్ల మోక్షాన్ని ఎట్లు పొందవచ్చును అనే విషయం తంత్రశాస్త్రంలో వర్ణింపబడింది.

రామాయణ, మహాభారతాలను ఇతిహాసాలంటారు. సీతారాముల కథద్వారా రామాయణము వివిధజనుల విషయంలో మానవుల నైతిక ప్రవర్తన ఎట్లుండవలెను, వారి ధర్మాలేవి అనే విషయాలను బోధిస్తుంది. రామాయణము రామునికథను ఎంత బోధిస్తుందో అంతే సీతకథనుకూడా బోధిస్తుంది. కాబట్టి అది స్త్రీధర్మాన్నికూడ బోధించినట్టే. పుత్రుడు తండ్రి యాజ్ఞలను ఎట్లు పాటింపవలెను. అన్నదమ్ములు పరస్పరమెట్లు ప్రేమతో మెలగవలెను. భార్య భర్తకు ఎట్లు విధేయురాలై ఉండవలెను. భృత్యునికి యజమాని విషయంలో ఉండవలసిన భక్తి ఎట్టిది, మిత్రులు ప్రేమతో పరస్పరం క్షేమానికి

అనే విషయాలు, స్త్రీలగుణాలైన ప్రేమ, మార్దవం, సౌకుమార్యము తదితర హైందవమతతత్త్వాలు సీతారాముల జీవితకథారూపంలో రామాయణమునందు వర్ణింపబడినాయి. అంతేకాక మానవులు వారి జన్మను బట్టికాక వారి నైతిక ప్రమాణాలను అనుసరించి గౌరవింపబడ వలెననీ, దైవభీతికల జంతువులుకూడ గౌరవార్హములగుననీ రామాయణము బోధిస్తుంది. శరణుపొందినవానిని విడువరాదని రామాయణములో చెప్పబడడంవల్ల దానికి శరణాగతిశాస్త్రమనే పేరుకూడ ఉన్నది. దేవుని దయకొఱకు కేవలం ఒక్కసారి ప్రార్థించినా సర్వదా మానవులను రక్షించడానికి ఈశ్వరుడు ఆతృతతో ఉంటాడు. గొప్ప ఆపత్తులలో దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయడానికి ఈశ్వరుడు వేర్వేరు రూపాలలో అవతారాల నెత్తుతాడని రామాయణము దృష్టాంత పూర్వకంగా చెప్పుతుంది. దుష్టశిక్షణ అనేది దుష్టులను వారి పాపమయ జీవితాలనుండి రక్షించి వారిని సంస్కరించడానికి ఈశ్వరుడు చూపే అనుగ్రహము. ఈ విషయాన్నే ఇతిహాస, మహాభారతాలు చక్కగా చిత్రించినాయి. మనమతంలోని సత్యము, దైవాసక్తి, స్త్రీపవిత్రత, అర్థుల (దీనుల) విషయంలో దయచూపడము, ఓర్పు, తపస్సు మొదలైన విషయాలు మహాభారతంలో బోధింపబడినాయి. కాబట్టి భారతానికి వేదమనీ, ధర్మశాస్త్రమనీ పేరు. కథా ప్రసంగంలో ధర్మ తత్త్వాలను బోధించడానికి కొన్ని ప్రత్యేక అధ్యాయాలు కేటాయించ బడినాయి. వీటిలో మోక్షధర్మం, విదురనీతి, సనత్సుజాతీయం, అణు గీత ముఖ్యమైనవి. కాని వీటి అన్నింటికంటే భగవద్గీత చాలా ప్రసిద్ధి చెందింది. దీనిలో 18 అధ్యాయాలు, 700 శ్లోకాలు ఉన్నాయి. ఇది మహాభారతంలో ఒక అధ్యాయం మాత్రమే అయినప్పటికీ గొప్ప వేదాన్తతత్త్వం దీనిలో వర్ణింపబడటంవల్ల దీనికి ప్రత్యేకమైన గుర్తింపు కలిగింది. మహాభారతయుద్ధ ప్రారంభంలో అర్జునుడు తాను

చేసికొని సారథియైన శ్రీకృష్ణుడు అర్జునునికి ఉపదేశం చేసే వ్యాజంతో జగత్తుకంతా ఉపదేశాన్ని అందజేసినాడు. భగవద్గీత మొదటి ఆరు అధ్యాయాలలో కర్మయోగాన్ని, తరువాత ఆరు అధ్యాయాలలో జ్ఞానయోగాన్ని, చివరి ఆరు అధ్యాయాలలో భక్తియోగాన్ని ఉపదేశించు చున్నది. విశ్వజనీనమైన మన మతానికి మౌలికములైన సిద్ధాంతాలు ఈ గ్రంథంలో స్పష్టంగా బోధింపబడినాయి. ఎంత కష్టం ప్రాప్తించినా ఎవ్వరూ తమ ధర్మాల నాచరించడం విడువకూడదని ఎవరే రూపంలో ఈశ్వరుని చిత్తశుద్ధితో మనః పూర్వకంగా సేవిస్తే ఆ రూపంలో ఈశ్వరుడు వారిని తప్పక రక్షిస్తాడని, ఈశ్వరకృపయే మానవుల నందరినీ వారి వారి పాపాలనుండీ రక్షిస్తుందనీ, ఇంకా ఇటువంటి సిద్ధాంతాలు ఈ గ్రంథంలో వివరింపబడడంవల్ల భగవద్గీత సర్వమత సిద్ధాంతాలకు ప్రమాణగ్రంథమై ప్రపంచస్థాయిలో ఆదరణ, గుర్తింపును పొందింది. కనుకనే దానిని ప్రస్థానత్రయంలో (అంటే ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, గీత) ఒక గ్రంథంగా చేర్చినారు. దీనికి భిన్న భిన్న సిద్ధాంతాలకు అనుగుణంగా చాలా వ్యాఖ్యానాలు సంస్కృతంలోను, తెలుగులోను, ఇతర భాషలలో అనువాదాలు ఉన్నాయి. ప్రతి ఒక్కరు దీనిని చదివి ఇందులో చెప్పబడిన విషయాలను ఆచరణలో పెట్టవలెను.

పురాణాలు ప్రపంచంయొక్క చరిత్రను వర్ణిస్తాయి. వీటిలో ప్రపంచం ఏ విధంగా సృష్టింపబడి, పాలింపబడి, లయం చేయబడుతుం దనే విషయాలు వర్ణింపబడినాయి. చిదచిదాత్మకమైన ప్రపంచం నిత్యమైనది. అది ప్రళయకాలంలో సూక్ష్మంగాను, సృష్టికాలంలో స్థూలంగాను ఉంటుంది. జగత్తులోని నైతికప్రవర్తన యే విధంగా ఈశ్వరుని చేత కాపాడబడుచున్నది. దుష్టులేవిధంగా శిక్షింపబడి ముకులౌతున్నారు, సజ్జనులేవిధంగా రక్షింపబడుతున్నారు అనే

ఉపాఖ్యానాలమూలకంగా మన మతంలోని ముఖ్యాంశాలను
దేశంలోని వివిధక్షేత్రాల మహిమను వర్ణించి ఆ యా
ఈశ్వరుని మహిమను, పవిత్రతీర్థాల మహిమను చాటుతా
కాక తపస్సుచేసే పద్ధతులను, ముక్తిని పొందడాని
భగవద్భక్తిని వర్ణిస్తాయి. కనుకనే ఇవి మన మతాని
గ్రంథాలు. మనకుండే పురాణాల్లో పద్దెనిమిది ముఖ్యమైన
లోని విష్ణు, బ్రహ్మ, శివ మాహాత్మ్యవర్ణనముల ననుసరించి
రాజస, తామస పురాణములని పురాణాలు మూడువిధము
భిన్న భిన్న దేవతలను వర్ణించే పద్దెనిమిది ఉపపురాణా

మతంలోని ఆచార (అనుష్ఠాన) భాగాలకు ఆగమ
ఇవి దేవాలయ నిర్మాణం, అర్చ (విగ్రహ) నిర్మాణం, దే
విగ్రహాల సంస్కారాలు, అర్చారాధనక్రమం, కార్యాక్ర
కలిగిన లోపాలకు ప్రాయశ్చిత్తాలు మొదలైనవాటిని
ప్రాసంగికంగా వాటిలో భక్తుని గుణాలు పట్టణ నిర్మాణక్రమ
వివరింపబడినాయి. ఈశ్వరావతారాలు భిన్న భిన్న అర్చా
వెలసినాయనీ, ఆ యా ప్రయోజనాలు సిద్ధించడానికి ఆ య
వతారాలను ఉపాసింపవలెననీ వీటిలో చెప్పబడింది. ఆగమా
విధాలు. విష్ణు, శివులకు సంబంధించిన ఆలయాలు, విగ్రహా
పద్ధతులను గురించి వివరించే ఆగమాలకు క్రమంగా వైష్ణవ
గమా లని పేరు. పాంచరాత్ర వైఖానస ఆగమాలను వైష్ణ
లంటారు. పాంచరాత్రాగమాన్ని సాక్షాత్ నారాయణుడే బోధిం
వైఖానసాగమాన్ని విఖనసమహర్షి ప్రవచించినాడనీ పెద్ద
ప్రాచీనమైన ఆగమాలకు సంహిత అని పేరు. పాద్మసంహి
సంహిత, సాత్త్వతసంహిత, కపింజలసంహిత, ఈశ్వరసంహి

అనేవి సంహితలు. అత్రి, మరీచి, కాశ్యప, భృగుమహర్షులచేత రచింపబడినవి వైఖానస సంహితలు. ఈ సంహితలు మనకిప్పుడు లభించడం లేదు. శైవాగమాలు ఇరవై ఎనిమిది అని అంటారు.

ప్రతి ఆగమంలోను చర్యా, క్రియా, యోగ, జ్ఞానము అనే నాలుగు భాగా లుంటాయి. మొదటి భాగం నిత్యవిధులను, రెండవ భాగం ఈశ్వరధ్యానాన్ని, మూడవ భాగం ఇంద్రియవిగ్రహోపాయాల ద్వారా ఏ విధంగా ఈశ్వరధ్యానం చేయవచ్చు అనే విషయాన్ని, నాలుగవ భాగం ఈశ్వరస్వరూపాన్ని, దేహనిర్మాణాన్ని, ముక్తిని గురించి బోధిస్తాయి.

ఆచారకర్మకాండకు సంబంధించినవి తంత్రాలు. అవి అర్చామూర్తులయొక్క, యంత్రములయొక్క ఆరాధనను, మంత్రజపాన్ని, ఉపాసనను బోధించి మానవునిలో దాగిఉండే శక్తిని వృద్ధిపొందించి ఈశ్వరసాక్షాత్కారాన్ని కలుగజేస్తాయి. ప్రాపంచిక సుఖాలను పొందడానికి కూడ తంత్రాలను ఉపయోగిస్తారు.

పైన చెప్పబడిన వాఙ్మయమంతా సంస్కృతభాషలో ఉంది. ఈ వాఙ్మయంతోపాటు తమిళభాషలో కూడా హైందవమతవాఙ్మయం ఎక్కువగా ఉంది. ఈ వాఙ్మయానికి విశిష్టాద్వైత శైవసిద్ధాంతాలలో గొప్ప స్థానం ఉంది. వైష్ణవ ఆళ్వార్ల, శైవ నాయనార్ల గ్రంథాలీ వాఙ్మయానికి చెందుతాయి. తమ జ్ఞానం, సద్వర్తన, సచ్ఛీలములచేత ఈశ్వరసాక్షాత్కారం, ఈశ్వరైక్యాన్ని పొందిన గొప్ప యోగులచేత రచింపబడిన వాఙ్మయ మిది. వారిలో పొంగిపొరలుతూఉండే ఆధ్యాత్మికచైతన్యం గ్రంథరూపాల్లో వెలసింది. వైష్ణవమతానికి సంబంధించిన నాలుగువేల శ్లోకాల సమూహాన్ని 'దివ్యప్రబంధము'

బడి వారి గ్రంథాలు. ప్రసిద్ధమైన ఆళ్వార్లలో ...
పొయ్‌గై ఆళ్వార్ (సరోయోగి), పూదత్ఆళ్వార్ (భూతయోగి), పేయ్ఆళ్వార్ (మహాయోగి)లు ఒక్కొక్కరు నూరు పాశురాలను (పద్యాలను) రచించినారు. ఇవి "ఇయత్పా" అనే గ్రంథంలో ఉన్నాయి. అదే విధంగా తిరుమళిశై ఆళ్వార్ (భక్తిసారుడు) రచించిన తొంభై ఆరు పాశురాలు, "ఇయత్పా" లోను, నూటఇరవై పాశురాలు ఉండే "తిరుచ్చందవిరుత్తం", "ముదలాయిరం" లోను ఉన్నాయి. ఆళ్వార్లందరిలోను గొప్పవాడైన నమ్మాళ్వార్ (లేక శఠకోపుడు లేక వకుళాభరణుడు), 'నూరు' పాశురాలుండే 'తిరువిరుత్తం'ను, ఏడు పాశురాలుండే 'తిరువాశిరియం'ను, ఎనభై ఏడు పాశురాలుండే "పెరియ తిరువందాది"ని రచించినాడు. ఈ నాలుగు గ్రంథాలు ఋగ్వేద, యజుర్వేద, అథర్వణవేద, సామవేదాలకు ప్రతినిధులని అంటారు. వీటిలో చివరి గ్రంథం శ్రీవైష్ణవమతసిద్ధాంతాలకు ముఖ్యమైనది, ప్రమాణమైనది కావడంవల్ల చాలామంది వైష్ణవులు దీనికి వ్యాఖ్యానాలను వ్రాసినారు. కులశేఖరఆళ్వార్ నూటఐదు పాశురాలుండే "పెరుమాళ్‌తిరుమొళి"ని రచించినాడు. ఇది "ముదలాయిరం" లోని అంతర్భాగము. పెరియాళ్వార్ (విష్ణుచిత్తుడు లేక భట్టనాథుడు) రచించిన "తిరుప్పల్లాండు" చాలా ప్రసిద్ధమైనది. దీనిలో పన్నెండు పాశురాలున్నాయి. నాలుగువందలఅరవై ఒకటి (461) పాశురాలుండే "తిరుమొళి" కూడా ఆయనచేత వ్రాయబడింది. ఇవి రెండూ "ముదలాయిరం"లోని అంతర్భాగాలు. తొండర్అడిప్పొడి ఆళ్వార్ (భక్తాంఘ్రిరేణువు లేక విప్రనారాయణుడు) నలభైఐదు (45) పాశురాలుండే "తిరుమాలై", పది(10) పాశురాలుండే "తిరుప్పళ్ళి ఎళుచ్చి" అనే గ్రంథాలను వ్రాసినాడు. ఇవి కూడా "ముదలాయిరం" లోని అంతర్భాగాలు. తిరుప్పాణాళ్వార్ (యోగివాహనముని) పది పాశురాలుండే "అమలనాదిపిరాన్" అనే గ్రంథాన్ని (ముదలాయిరంలో అంతర్భాగ

తాండకం", ముప్పది పాశురాలుండే "తిరునదన్‌తాండకం" ఒకే పాశురంలోఉండే "తిరువెళుకూత్తిరుక్కై", "శిరియతిరుమండల్", "పెరియతిరుమదల్"లను రచించినాడు. చివరి రెండు గ్రంథాలలోని పాశురాల సంఖ్యనుగురించి పలువురు పలురకాలుగా చెప్పుతారు. "కణ్ణినున్‌శిరుత్తాంబు"ను మధురకవిఆళ్వార్, నూటనలభై మూడు పాశురాలుండే "నాచ్చియార్‌తిరుమొళి"ని, ముప్పది పాశురాలుండే "తిరుప్పావై"ను గోదాదేవి రచించినారు. పై చెప్పబడిన పాశురాలు తిరువరన్‌గత్తముదనార్ రచించిన "ఇరామానుజనూత్తన్‌దాది"తో కలసి 4000పాశురాలుండే దివ్యప్రబంధమైంది. వైష్ణవమతసిద్ధాంతాలు ప్రతిభాశాలురైన ఆళ్వార్లచేత బోధింపబడడంవల్ల వైష్ణవులకు దివ్యప్రబంధం ఉపనిషత్తులతో సమానంగా ప్రమాణగ్రంథమైనది, సంస్కృతంలోని ఉపనిషత్తులు, దివ్యప్రబంధం కలసి "ఉభయవేదాంతం" అయింది. మాతృభాష (ప్రాంతీయభాష)లో ఉండే ఈ వాఙ్మయంలోని ప్రత్యేకత, దేవాలయాల్లోని అర్చావతారాల గొప్పతనాన్ని వర్ణించడమే. ఆ యా దేవాలయాల్లో ఆ యా ఆళ్వార్లు పొందిన ఆధ్యాత్మికానుభూతి ఈ వాఙ్మయంలో చోటుచేసికొని ఉంది. ఈ వాఙ్మయంలో, తొమ్మిదిమంది ఆళ్వార్లు శ్రీనివాసుని స్తుతించినారు.

తమిళంలో రచింపబడిన పన్నెండు శైవమతకీర్తనలకు "తిరుమురై" అని పేరు. తిరుజ్ఞానసంబంధర్, తిరునావుక్కరసు (అప్పర్), సుందరమూర్తులచేత రచింపబడిన "తేవారం", "తిరుమురై"లోని మొదటి ఏడు భాగాలవుతుంది. మాణిక్యవాచకర్ రచించిన "తిరువాచకం" "తిరుక్కోవయార్" అనేవి 8 వ భాగం, వేర్వేరు ఇతర భక్తులు వ్రాసిన "తిరువాచయప్ప", "తిరుప్పల్లాండు" అనేవి 9 వ భాగం, తిరుమూలర్ వ్రాసిన తిరుమంత్రం 10 వ భాగం అవు

తాయి. 40 కీర్తనలుండే 11 వ భాగాన్ని 12 మంది రచించారు. శేక్కి-ళార్ రచించిన "పెరియపురాణం" (తిరుత్తొండర్ పురాణం) 12 వ భాగము. దీనిలో ముఖ్యంగా శివుని అర్చావతారం వర్ణింపబడింది. మానవులకు దేవునితో ఆదరాభిమానాలను పెంపొందించ డానికి ఈ (తమిళ) స్తోత్రాలు రచింపబడినాయి. తాయుమానవర్, పట్టినత్తార్‌లు రచించిన శివస్తుతులకు శైవులలో చాలా ప్రచారం ఉంది.

శైవమతానికి శైవసిద్ధాంత మని పేరు. వైష్ణవసిద్ధాంతానికి వలె దీనికి కూడా ఉపనిషత్తులు మూలము. మైకందన్ శివజ్ఞానసిద్ధియార్ రచించిన "శివజ్ఞానబోధం" అనే గ్రంథంలో శైవసిద్ధాంతాలు ప్రధానంగా ప్రతిపాదింపబడినాయి.

ఇటువంటి కీర్తనలు, స్తుతులు సంస్కృతభాషలో కూడా ఉన్నాయి. వీటికి స్తోత్రవాఙ్మయ మని పేరు. సాధారణంగా ఇవి 1 నుండి 100 శ్లోకాలలో భగవంతుని స్తుతిస్తాయి. భక్తుని అత్యంతిక శరణాగతి, భక్తుడు తన తప్పులొప్పుకొనుట, మోక్షప్రాప్తి కలుగక పోయెను కదా అని దుఃఖించుట, ఈశ్వరైక్యాన్ని పొందడానికి భక్తుని తహతహ మొదలైన భావాలు వీటిలో ఉన్నాయి. ఈ స్తోత్రా లసంఖ్యాకములగుటవల్ల కొన్ని ముఖ్యమైన స్తోత్రాలు మాత్రం ఇక్కడ పేర్కొనబడుతున్నాయి. అద్వైతాచార్యులైన శ్రీశంకరులు బ్రహ్మం, నిర్గుణము, నిరాకారము అని బోధించినా వివిధ దేవతలను స్తుతిస్తూ ఎన్నో స్తోత్రాలను రచించినారు. యామునాచార్యకృతమైన స్తోత్రరత్నములో 65 శ్లోకాలున్నాయి, దీనిలో మహోన్నత ఆధ్యాత్మికసత్యాలు ఎన్నో ఉన్నాయి. శ్రీరామానుజ విరచిత గద్యత్రయము చాలా ముఖ్యమైన స్తోత్రము. మొదటిదానిలో ఈశ్వరునికృప శరణు కోర

తుని ప్రార్థించిరి. కులశేఖరాళ్వార్ 40 శ్లోకాలలో రచించిన ముకుందమాల భక్తిభరితమైన ప్రసిద్ధస్తోత్రము. భక్తియొక్క ప్రాధాన్యము, ఈశ్వరుని కరుణ అనే రెండు విషయాలు ఈ స్తోత్రంలో చక్కగా వర్ణింపబడినాయి. శ్రీ రంగరాజ స్తవము, శ్రీ వరదరాజ స్తవము మొదలైనవి అర్చావతార స్తుతులు. వివిధదేవతల సహస్రనామావళులు భగవద్ధ్యానాన్ని దృఢతరం చేయడానికి సహాయపడుతాయి. శ్రీరామచంద్రుని స్తుతిస్తూ త్యాగరాజు వ్రాసిన భక్తికీర్తనలు, శ్రీ వేంకటేశ్వరుని కీర్తిస్తూ అన్నమాచార్యులు తెలుగులో వ్రాసిన సంకీర్తనలు చాలా ప్రసిద్ధిని పొందినాయి.

మానవుడు మోక్షప్రాప్తికి సాధనాలుగా ఉపయోగించుకుంటాడు. ధర్మార్థకామాలకు త్రివర్గాలనీ, వీటితో కూడిన మోక్షానికి చతుర్వర్గమనీ పేరు. మోక్షప్రాప్తిని కలిగించే వ్యవహార పద్ధతిని ధర్మమంటారు. అది మోక్షాన్ని కోరేవారి ప్రవర్తనను నియంత్రిస్తుంది. దీనిని మానవ నైతికాచారాన్ని, జీవితాన్ని క్రమబద్ధంచేసే శాస్త్ర మనవచ్చును. ఇదియే ధర్మశాస్త్రము. ప్రతిమానవుడు తనకు ప్రేయస్సు (ఇష్టం) కలిగించే దాని కన్నా శ్రేయస్సు (మంచి)ను కలిగించే దానిని కోర వలెనని ధర్మశాస్త్రం బోధిస్తుంది. ప్రేయస్సును కోరే వానిని అజ్ఞాని అని, శ్రేయస్సును కోరేవానిని పండితు డని అంటారు. ప్రాపంచిక సుఖాలు క్షణికాలు, అశాశ్వతములని, శాశ్వతానందాన్ని కలిగించేది మోక్షం మాత్రమే నని పండితుడు తెలిసికొంటాడు. యజ్ఞయాగాదుల నాచరించడంవల్ల, తపస్సుచేయడంవల్ల ప్రాప్తించిన స్వర్గ, బ్రహ్మలోక సుఖాలుకూడ అశాశ్వతమైనవి. మానవుడు శాశ్వతానందాన్ని పొంద డానికి ఇంద్రియాలను నిగ్రహించి తనను గురించి తాను తెలిసికొన వలెను. ఇది ధర్మమార్గం వల్ల సిద్ధిస్తుంది. ప్రతిఫలాపేక్షలేకుండా ఈశ్వరార్పణంగా ధర్మాన్ని ఆచరింపవలెను. ఇటువంటి ధర్మాచరణం శ్రేయస్సును కలిగిస్తుంది. ధర్మము నైతిక ప్రవర్తన నియమావళినే కాక సచ్ఛీలనియమావళిని కూడా విధిస్తుంది.

ధర్మం జీవితానికి సంబంధించిన ధార్మిక, సాంఘిక, రాజకీయ ఆరోగ్యవిషయాలలో మానవుని ప్రవర్తనను క్రమబద్ధం చేస్తుంది. ధర్మము వర్ణధర్మం, ఆశ్రమధర్మం అని రెండు విధాలుగా ఉంటుంది. హైందవమతం మన సంఘాన్ని జనులలో వారి వారి అభిరుచిని

లను, విధులను ఏర్పాటుచేసింది. అదేవిధంగా మానవుని జీవితాన్ని నాలుగు దశలు (లేక ఆశ్రమాలు) గా విభజించి వాటి ధర్మాలను ఉపదేశించింది. మన సంఘంలోని చతుర్వర్ణవ్యవస్థ భారతదేశంలోని అసాధారణమైన విషయము. ఈ వ్యవస్థ సాంఘికమైన ఆర్థికస్థితిమీద ఆధారపడినది. అందుకే వర్ణధర్మాన్ని, ఆశ్రమధర్మాన్ని కాపాడడం రాజుయొక్క విధులలో ఒకటిగా చెప్పబడింది. ధర్మాన్ని చక్కగా రక్షింపలేని రాజును అసమర్థుడంటారు. వర్ణాశ్రమధర్మాన్ని పాలింపలేని వారిని శిక్షించడానికి రాజుకు అధికారం ఉంది.

ఈ గ్రంథంలో వర్ణాశ్రమధర్మాలన్నిటినీ చెప్పడం సాధ్యం కాదు, కనుక అందులో ముఖ్యమైనవి సూక్ష్మంగా చెప్పబడుతాయి. వేదాలను అధ్యయనం చేసి, ఇతరులకు చెప్పడం, తాను స్వయంగా యజ్ఞయాగాదులు చేయడం, ఇతరులచేత చేయించడం, దానం చెయ్యడం, తీసికొనడం బ్రాహ్మణుని ధర్మము. ఇందులో వేదాలను చదవడం, యజ్ఞాదులు చేయడం, దానంచెయ్యడం క్షత్రియులకు వైశ్యులకుకూడ విధింపబడిన ధర్మాలు. క్షత్రియుని ప్రత్యేకమైన ధర్మం ప్రజలను, వారి ధర్మాన్ని రక్షించడమే. వ్యవసాయం, పశుపోషణ, వ్యాపారం వైశ్యుల ధర్మాలు. ఇతర వర్ణాలవారికి వారి వారి ధర్మాచరణంలో సహాయపడడమే శూద్రుని ధర్మము. ఈ విధంగా ధార్మిక, రాజకీయ, ఆర్థిక, కార్మిక వ్యవస్థలలో సంఘానికి కట్టుబాట్లు కల్పించడమే వర్ణ వ్యవస్థ చేయు పని.

పైన చెప్పిన సాంఘికధర్మాలను విధించడమే కాక దాదాపు అన్ని వర్ణాలవారికీ సామాన్యమైన కొన్ని ధర్మాలను (విధులను) కూడ ధర్మశాస్త్రం విధిస్తుంది. వీటిని సంస్కారా లంటారు. అవి (1) గర్భాదానము (2) పుంసవనము (పురుషసంతానం కలిగేందుకు జరిపే

...), (3)సీమంతోన్నయనము (...
వైదికమంత్రాల నుచ్చరిస్తూ పాపిటను చక్కగా దువ్వడము), (4) జాతకర్మ (5) నామకరణము (6) అన్నప్రాశనము (7) చౌలము (కేశ ఖండనము) (8)ఉపనయనము (9)వివాహము. ఉపనయనం తరువాత వేదాధ్యయనం విధించబడింది. వీటి తరువాత ఐదు సంస్కారాలు చెప్పబడినాయి. అందుకే హైందవుడైనవానికి పుట్టినది మొదలు గిట్టేవరకు జీవితమంతా సంస్కారాలమయంగా ఉంటుంది. అంటే జీవించడమే ఒక సంస్కారము. మనం దైనందిన జీవితంలో చేసే పనులన్నీ భగవంతుని ఆరాధించడమే అని పెద్దలంటారు.

పైన చెప్పిన ధర్మాలు, విధులేకాకుండా ప్రతిదినం చేయవలసిన, అప్పుడప్పుడు చేయవలసిన విధులు కొన్ని ఉంటాయి. ప్రతిదినం చేయవలసినవి పంచమహాయజ్ఞాలు. అవి (1)బ్రహ్మయజ్ఞం (వేదాన్ని అధ్యయనం చెయ్యడం), (2)పితృయజ్ఞం (పితృదేవతలకు తర్పణాలు వదలడం), (3)దేవయజ్ఞం (భగవంతుని పూజించడం), (4)భూతయజ్ఞం (కాకి, చీమలు మొదలైన జీవులకు ఆహారాన్ని పెట్టడం), (5) మనుష్యయజ్ఞం (అతిథులకు సత్కారం చెయ్యడం). దేవతలను, మానవులను, వారికంటే తక్కువ స్థితిలో ఉన్న పశుపక్ష్యాదులను పోషించడం, ప్రపంచంలోని దేవ, మానవ, తిర్యక్ సమూహాల ఐక్యాన్ని చాటడం, గృహస్థునికి సంఘంలోని తనతోటివారి విషయంలో ఉండే బాధ్యతలను పంచమహాయజ్ఞాలు గుర్తుచేస్తాయి. ఇవి కాక 7 పాకయజ్ఞాలు, 7 హవిర్యజ్ఞాలు, 7 సోమయజ్ఞాలు— మొత్తం 21 యజ్ఞాలున్నాయి. వీటిని మానవులు అప్పుడప్పుడు తమ తమ కాలపరిస్థితులకు, కోర్కెలకు అనుగుణంగా వికల్పంగా చేయవచ్చును. కాని పాకయజ్ఞంలో ...

విరిడా చేయవలెను. ప్రతిమానవుడు తనకు జన్మనిచ్చిన తల్లిదండ్రులకు, వంశకర్తలకు ఋణపడి ఉంటాడు, కనుక దీనిని విడిచినవాడు పతితు డౌతాడు.

మానవజీవితాన్ని ఆధ్యాత్మికం చేయడమే ఈ సంస్కారాల ఉద్దేశము. కోపం, భయం, అసూయ మొదలైన భావావేశాలను కలిగి జంతువులవలె కేవలం తమ సంతానాన్ని అభివృద్ధిచేసికొనడానికి మాత్రమే మానవులు పాటుపడకూడదని మన పెద్దల అభిప్రాయము. వివేకం, మనస్సు, తార్కికశక్తి ఉన్నవాడు మానవుడు కనుక పశుపక్ష్యాదులకంటే గొప్పవాడని తాను భగవంతుని నుండి వచ్చినవాడని, తిరిగి భగవంతునే చేరవలెను అని తెలిసికొని మానవుడు ఆధ్యాత్మిక ప్రపంచంలో జీవిస్తూ తనవేష ఆహారవిహారాదుల్లో ఆధ్యాత్మికతను చూపించవలెను. సంస్కారాలన్నీ భగవంతుని చేరడానికి జీవుని పరిశుద్ధునిగా చేయడానికి ఉద్దేశింపబడినాయి. అందుకే ఉపనయనం చాలా ముఖ్యమైన సంస్కారము. దీనిలో వటువులకు యజ్ఞోపవీతాన్ని ధరింపచేసి వేదాల్లోని కొన్ని సూక్తాలను చెప్పించి భగవదారాధనను నేర్పిస్తారు. భగవదారాధనమే ధార్మికజీవన సారాంశము. వివాహం ఒక పవిత్రమైన ఆధ్యాత్మికకర్మ. దీనివల్ల మానవుడు వైదికకర్మలనాచరిస్తూ ఆధ్యాత్మికంగా ఔన్నత్యాన్ని పొంది వంశాన్ని వృద్ధిచేసికొని తద్వారా తన పితృదేవతల ఋణాన్ని తీర్చుకొంటాడు. సంస్కారాలవల్ల మానవజీవితం సార్థకం, ఈశ్వరార్పణం అవుతుంది. ఇందుకోసం మనమతం పైన చెప్పిన సంస్కారాలనే కాక పారమార్థిక సత్యాన్ని చేరుకోవడానికి ఉపకరించే ప్రవర్తనానియమావళిని కూడ దీర్ఘంగా వివరించింది. వీటిలో కొన్నింటిని ఇక్కడ పొందుపరుస్తాము: (1) శౌచము: అంటే మనసు, మాటలను, చేతలను శుచిగా ఉంచడము, మనస్సును శుచిగా ఉంచడం, అంటే మనస్సు సత్త్వగుణంనుండి రజోతమో

పలుకకుండా ఇతరుల మనస్సునొప్పించే విధంగా
పోవడము. (2)వివేకము: అంటే ఇది మంచిది, ఇ
ఆత్మ, ఇది అనాత్మ అని తెలిసికొనే జ్ఞానము. (3)ఆర్జ
మనో, వాక్, కాయ కర్మలలో ఏకత్వాన్ని కలిగి ఉం
సమత్వము: అంటే ఇతరుల సుఖాదుఃఖాలను తనవిగా
(5)తుష్టి: అంటే తనకున్న దానితో తృప్తిపడడము.
దమములు; అంటే మనస్సును, ఇంద్రియాలను అవాంఛ
దగ్గరికి పోనివ్వకుండా నిగ్రహించడము, (8)దానము:
ఉండేదానిని ఇతరులకివ్వడము, (9)త్యాగము: అంటే త
దానిని వదలి పెట్టడము. (10)దయ: అంటే ఇతరుల క
లను చూచి వారిమీద దయచూపడము (11) మార్దవ
ఇతరుల కష్టాలను చూచి మనసు కరిగిపోవడము (1
చేయరాని పనులు చేసినప్పుడు కలిగే నైతికమైన సిగ్గు
అంటే ఇతరులు కలిగించిన కష్టాలను సహించడం లేక
మొదలైన ద్వంద్వాలను సహించడము. దీనికే శాంతి
కూడా పేరు. (14)ధైర్యము: అంటే ఎన్నో ప్రమా
నప్పటికీ తన కర్తవ్యాన్ని నెరవేర్చడము. (15)శ్రద్ధ:
విషయంలో భక్తి గౌరవాలు ప్రదర్శించడము (16)తప
మతసంబంధమైన క్రియాకలాపాలను ఆచరించడానికి
గ్యంగా, సమర్థవంతంగా ఉంచుకోవడానికి చేసే శారీరక వ
(17)వైరాగ్యము: అంటే ఇంద్రియవాంఛలను త్యజించ
చెప్పిన సంస్కారాలను పొందడం కన్నా ఈ 17—సుగ
పరచుకోవడం చాలా ప్రశస్తం అంటారు. సంస్కారా

ఈ గుణాలను అలవరచుకోవడమే కాక ఈ క్రింది [illegible] కొన్ని ముఖ్యమైన దుర్గుణాలను వదలిపెట్టవలెనని హిందూమతం ఉద్ఘోషిస్తుంది. (1) కామము: అంటే ఇంద్రియసుఖాలను కోరడము (2) క్రోధము: అంటే ఇతరులకు దుఃఖాన్ని కలిగించడము (3) లోభము: అంటే మరింత వస్తుసంపదను పొందవలెననే కోరిక (4) మోహము: అంటే ఒకదానిని చూచి మరొకటిగా భ్రమించడము (5) మదము: అంటే స్వార్థపూరితమైన ఆనందానుభవంద్వారా కలిగే గర్వము (6) మాత్సర్యము: అంటే ఇతరుల సంపదను చూచి అసూయపడడము, (7) దంభము: తనను గురించి గొప్పగా తానే ప్రచారం చేసికొనడము (8) మానము: ఇతరులకన్న తామే గొప్ప అని భావించుకొనడము, వారిని అవమానించడము (9) పారుష్యము: అంటే ఇతరులకు దుఃఖం కలిగించే విధంగా క్రూరంగా ప్రవర్తించడము. (10) అజ్ఞానము: అంటే ఏది మంచి ఏది చెడ్డ అని తెలిసికొనే జ్ఞానం లేకపోవడము (11) అహంకారము: అంటే తానే గొప్ప అని తృప్తి చెందే స్వాత్మాతిశయము. దేహమే తాను అని అనుకొనడంకూడా అహంకారమే. (12) మమకారము: ఇది నాది, ఇది నాకు చెందినది అని అనుకొనడము. (13) ప్రమాదము: అంటే అజ్ఞానం వల్ల కలిగే వక్రబుద్ధి. (14) ఈర్ష్య: అంటే ఓర్వలేనితనము (15) అసూయ: అంటే సజ్జనులకు దుష్టత్వాన్ని అంటగట్టడము. వీటిలో అతిదుష్టమైనవి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు. వీటిని అరిషడ్వర్గాలంటారు. అంటే ఇవి పారమార్థికచింతనకు అడ్డుపడే ఆరు శత్రువులు. ఈ ఆరింటిలో కామ, క్రోధ, లోభములనే మూడింటిని మరింత దుఃఖకారకములని అంటారు. అన్నింటికన్న అత్యంత నీచమైనది, హేయమైనది కామము, ఇది అన్ని పాపాలకు పుట్టినిల్లు.

మానవజీవితం నాలుగు దశలుగా విభజింపబడింది. ఒక్కొక్క-

మజిలీలు. ఆశ్రమాలు మానవుని వ్యావహారిక జీవితం నుండి తప్పించి పారమార్థిక జీవితానికి తీసికొనివెళ్లి చివరకు పరమాత్మ సాక్షాత్కారానికి దారితీస్తాయి. వీటిలో మొదటిది బ్రహ్మచర్యాశ్రమము. దీనిలోనికి మానవుడు తన ఏడు లేక ఎనిమిదవ ఏట ప్రవేశిస్తాడు. ఇది గురుకులంలో విద్యార్థి చదువుకొనే కాలము. అప్పుడు అతని ధ్యాసమంతా చదువుమీద కేంద్రీకృతమై ఉంటుంది. బ్రహ్మమంటే పారమార్థికజ్ఞానానికి ఆధారమైన వేదము. బ్రహ్మచర్యమంటే వేదాలను అధ్యయనము చేయడము. చదువు లన్నింటిలోను ఉత్తమమైనది వేదాధ్యయనము. మానవుడు తనలో ఉండే పాశవిక ప్రవృత్తిని నశింపజేసుకోవడమే దీని ప్రయోజనము. బ్రహ్మచారి క్రమబద్ధమైన జీవితాన్ని గడపుతూ ఆత్మ సంయమనాన్ని అలవరచుకొని బ్రహ్మచర్యాన్ని పాటింపవలెను. అతడు తన ఆహారం సంభాషణ నడవడికలలో మితంగా ఉండవలెను. ఆహారం కొఱకు భిక్షమెత్తి భిక్షాన్నంలో గురువిచ్చినంత మాత్రమే తినవలెను. ఆహారంలో ఉప్పు, పులుసు, కారం ఎక్కువగా వాడరాదు. మద్యమాంసాలను విసర్జింపవలెను, పగటిపూట నిద్రింపరాదు. అలంకరించుకోరాదు. బండ్లలో ప్రయాణం చేయకుండా పాదచారిగానే పోవలెను. చెప్పులు ధరింపరాదు. కామ క్రోధ లోభాలను కలిగించే వస్తువులను వాడరాదు. వివేకంతో ప్రవర్తింపవలెను. సంగీతం నృత్యముల జోలికి పోరాదు. ఇతరులలో తప్పులు వెదకరాదు. తాను తప్పులు చేయరాదు. సకాలంలో సంధ్యావందనాన్ని తప్పక చేయవలెను. విద్యార్థి తన చదువుకోసం గురువుకు జీతం చెల్లింపవలసిన పని లేదు; అతని చదువుకయ్యే ఖర్చును ప్రభుత్వమే గురువుకు జీతమిచ్చి భరిస్తుంది. గురువును భక్తితో సేవించి ఆయన ద్వారా జ్ఞానాన్ని, సంస్కృతిని సంపాదించుకోవడమే విద్యార్థికర్తవ్యము. గురువులయందు భక్తిని కలిగి ఉండడమే విద్యార్థుల ప్రథమకర్తవ్యము.

తరువాత విద్యార్థి గృహస్థాశ్రమానికి చేరుకొంటాడు, అంటే వివాహం చేసికొంటాడు. తన గోత్రం కన్నా భిన్నమైన ఇతర గోత్రాలనుండి తగిన అందమైన కన్యను అతను వివాహ మాడవలెను.
వివాహమనేది పారమార్థిక జీవితానికి సంబంధించిన ఒక సంస్కా
ఇది లైంగిక ఇంద్రియ సుఖాలకోసం ఉద్దేశింపబడినది కాదు.
కూడా భర్తకు ధర్మసాధనలో సహాయపడవలెను.
తనకు దేహాన్నిచ్చిన తల్లిదండ్రులకు
ఋణపడి ఉంటాడు. కాబట్టి అతడు
గృహస్థుడు తన విధులను
హాక్కులకొరకు పోరాడరాదు. [illegible]
శ్రాద్ధాలు చేసి వంశాన్ని నిలబెట్టడమే పితౄణము తీర్చుకోవడము. వేదాలను అధ్యయనం చెయ్యడం ఋషుల విధి. వేదాల్లో చెప్పిన యజ్ఞయాగాదులను ఆచరిస్తే దేవతలు సంతోషిస్తారు. శ్రాద్ధాలు, యజ్ఞ యాగాదులు చేయడానికి భార్యసహాయం ఎంతో అవసరము. అందుకే మన మతరీత్యా వివాహమనేది ఒక ధార్మిక సంస్కారమే కాని శారీరక వాంఛలు తీర్చుకోవడానికి ఉపకరించే కేవలమైన సంస్కారం కాదు. పైనచెప్పిన మూడింటినే కాక, పంచయజ్ఞాల్లో చెప్పబడిన మిగత రెండు యజ్ఞాలను కూడా భార్య సహాయంతోనే చేయడానికి వీలవుతుంది. కనుకనే మన పెద్దలు గృహనిర్వహణ మనే ప్రథమ కర్తవ్యాన్ని భార్యకు అప్పగించిరి. ఆహారాన్ని [illegible] క్షించే బ్రహ్మచారులకూ, ఇతర గృహస్థులకూ, ఇల్లూ వాకిలి లేని సన్న్యాసులకూ వానప్రస్థులకూ ఆహారాన్ని పెట్టడం కూడా గృహస్థు విధి. ఇది ఆశ్రమా లన్నిటిలోను గొప్పది కనుకనే పిల్లలు తల్లిపై ఆధారపడినట్లు అన్ని ఆశ్రమాలు గృహస్థాశ్రమం పైన ఆధారపడి ఉన్నాయి. పశువులు, కీటకాలు కూడా భూతబలికోసం గృహస్థుపైన ఆధారపడి ఉంటాయి. అందుకే సంఘానికి ఉపకరించే గృహస్థు

దానిలో ఇంద్రియ సుఖానికి తావు లేదనే అభిప్రాయాన్ని పంచయజ్ఞాలు సూచిస్తాయి. మానవుడు జగత్తునుండి తన ఉనికికి తీసికొన్నవాటిని జగత్తుకు తిరిగి ఇచ్చివేయడమే పంచమహాయజ్ఞాల పరమార్థము.

తరువాత వచ్చేది వానప్రస్థాశ్రమము. మానవుడు ముసలివాడై బుద్ధిచాంచల్యానికి లోనుకావలసి వచ్చినప్పుడు, లేక మనుమలు కలిగిన తరువాత గృహస్థాశ్రమాన్ని వదలిపెట్టి సంసారభారాన్ని కొడుకుల కప్పగించి భార్యతో లేక భార్యను విడిచి అడవులకు వెళ్లి జీవితశేషాన్ని భగవద్ధ్యానంతో గడపవలెను. ఆంతరంగిక పారమార్థిక శాంతిని సంపాదించడమే అడవులకు వెళ్లడం లోని అంతర్యము. అడవులలో కందమూలాలు, ఫలాలు, అడవులలో దొరకే ఇతర ఆహార వస్తువులతో జీవితాన్ని గడుపవలెను. వానప్రస్థుడు ఉపవాసాదులను చేసి కష్టాలను సహించి ఆత్మసంయమనాన్ని అలవరచుకొంటాడు. అతడు పంచమహాయజ్ఞాలను తప్పక చేయవలెను. తరువాత వచ్చే సన్న్యాసాశ్రమానికిది శిక్షణవంటిది.

సన్న్యాసియైనవాడు ఇంద్రియసుఖాలను అనురాగాలను చివరకు స్వర్గలోకసుఖాలను త్యజిస్తాడు. అతడు ఒంటరిగా జనసమ్మర్దం లేని చోట ఊరి వెలుపల నివసింపవలసినా, దేహధారణ కవసరమైన భిక్షాన్నం కోసం పట్టణాల్లోకి రావచ్చును. అతనికి ద్వేషాలు, అనురాగాలు ఉండవు. తనను ద్వేషించినవారిని ప్రేమిస్తూ ఇతరులకోసం జీవిస్తాడు. అతడు భగవంతునికంటే భిన్నుడు కాడు కనుక సర్వాన్ని భగవంతునిలోను, భగవంతుని సమస్త వస్తువులలోను చూస్తాడు. అతడే భూమిమీద ఉండే భగవంతుడు. అన్ని ఆశ్రమాల పరిపక్వ ఫలమే ఈ ఆశ్రమము. జీవిత సాఫల్యమే ఈ ఆశ్రమము. ధర్మాచరణంతో క్రమబద్ధమైన జీవితం దైవత్వాన్ని పొందడాని కుపకరించే

కర్మల నాచరిస్తూ ముక్తి పొందాడు.

పారమార్థిక వికాసంతో ఈ ఆశ్రమాలు కొన్ని దశలుగా పరిగణింపబడుతున్నాయి. ప్రతి మానవుడు ఆ యా ఆశ్రమాలలో ప్రతిఫలాపేక్ష లేకుండా శాస్త్రం విధించిన కర్మల నాచరిస్తూ మోక్షాన్ని పొందవచ్చును. ఆత్మశుద్ధి, ప్రాపంచికవస్తువులపై అనురాగం లేక పోవడం, భగవంతునిలో అత్యంతభక్తి ఇవి ఏ ఆశ్రమంలో ఉండే మానవునికైనా మోక్షాన్ని కలుగజేస్తాయి. మనంచేసే ప్రతి ధర్మము (విధి) కూడ సర్వకర్మలకు కర్తయైన ఆ భగవంతుని ఆరాధించడమే అవుతుంది. భగవంతుడే కార్యము, కర్త కూడ.

ఇప్పుడు మన మతంలో స్త్రీలకుండే హక్కులు, ధర్మాలను చర్చిస్తాము. శాస్త్రంలో పురుషధర్మానికి స్త్రీధర్మానికి మౌలికమైన భేదం ఎంతో ఉంది. స్త్రీలు ఎప్పుడూ పురుషులమీద ఆధారపడినవారు కనుక వారు ఏ పనులూ స్వతంత్రంగా చేయకూడదు. శాస్త్రము వారికి విధించిన ప్రత్యేకవిధులున్నప్పటికి వారు వాటిని స్వతంత్రంగా ఆచరించడానికి వీలు లేదు. పురుషులుకూడా స్త్రీలు లేకుండా ధర్మాన్ని స్వతంత్రంగా ఆచరించడానికి వీలు లేదు. కాని పురుషులకు, స్త్రీలకు ధర్మాచరణంలో ఉండే భేదమిది: పురుషుడు ఏవైనా కర్మల నాచరించడానికి ప్రారంభిస్తే అతని భార్య అతనితో సహకరించి సహాయాన్ని చేయవలెను. కాని భార్యమాత్రం భర్త అనుమతిలేనిదే ఏ కార్యాన్ని ప్రారంభించ కూడదు. భర్త అభీష్టానికి వ్యతిరేకంగా ఆమె ఏమైనా కార్యంచేస్తే అది నిష్ఫలమవుతుంది. దీనిని బట్టి చూస్తే భర్తకోర్కెల ననుసరించి పోవడమే స్త్రీకి ధర్మమని విదితమవుతుంది. మన శాస్త్రం ప్రకారం వివాహ మనేది ఒక అనుబంధం, పవిత్ర సంస్కారం కాబట్టి దీనిని

వ్యసనాలకు బానిస అయినప్పటికీ అతనిని విడువకూడదు. ఇదే విధంగా భర్తకూడ తన భార్యను విడువకూడదు. ఈ విధంగా భార్యా భర్తలు జీవితాంతం అన్యోన్యంగా అనురాగంతో కలిసి మెలిసి జీవింప వలెను.

ధార్మికకలాపాల్లో స్త్రీకి స్వాతంత్ర్యం లేనప్పటికీ గృహానికి ఆమె అధిపతి. ఇంటికి సంబంధించిన వ్యవహారాలన్నీ ఆమె అధీనంలో ఉంటాయి. భర్తతోపాటు ఆమెకు సమానంగా గౌరవం లభిస్తుంది. అంతేకాకుండా ఎక్కువ గౌరవం లభిస్తుంది గురువుకన్న నూరురెట్లు గౌరవాన్ని తండ్రికి, తండ్రికన్న వెయ్యిరెట్లు తల్లికి ఇవ్వవలెనని శాస్త్రాలు బోధిస్తాయి. ఎవరైనా తండ్రిని విడువవచ్చునుగాని తల్లిని ఏ పరిస్థితులలోను విడువకూడదు భర్త భార్యలో పుత్రరూపంలో జన్మిస్తాడు కాబట్టి ఆమెకు " జాయ " అని పేరు. అందుకే భర్తతో సమానంగా గౌరవార్హురాలు. స్త్రీలెక్కడ గౌరవింప బడుతారో అక్కడ దేవతలు సంతోషిస్తారు. స్త్రీలు గౌరవింప బడనిచోట చేయబడే కార్యకలాపా లన్నీ నిష్ఫల మౌతాయి. ఇంటికి దీపం ఇల్లాలే. ఆమె మూర్తీభవించిన సంపద అని శాస్త్రాలు ఘోషిస్తాయి.

హైందవసంఘంలో గృహ మొక పరిమాణము లేక కొలత. దీనికి స్త్రీ సర్వాధిపతి, సర్వస్వము. భర్తకు గృహస్థు డని స్త్రీకి గృహిణి అని పేరు. తల్లి కాని భార్య కాని లేని గృహం ఉండదు. ఆమె పురుషునికి (భర్తకు) ఆలోచనలలో తోడ్పడుతుంది. సంసార సాగరంలో జీవిత మనే నౌకకు చుక్కాని వంటిది. ప్రపంచంలో ఇంకే మతం గౌరవింపని రీతిగా హిందూమతం స్త్రీని తల్లిగా, భార్యగా గౌరవిస్తూ ఉంది.

సంస్కారము; అంతే కాని సంఘంలో స్త్రీపురుషులమధ్య చేయబడిన నాగరకమైన ఒప్పందం కాదు. హైందవ వివాహంలో కామము పశువాంఛలకు తావు లేదు. దీనిలో స్త్రీపురుషులు పత్నీ పతులుగా అన్యోన్యంగా విడదీయరాని జంటగా కలసిపోతారు. పవిత్రప్రేమ సహజంగా పుట్టుకొని వస్తుందనీ అన్యోన్యంగా ఉంటుందనీ, శాశ్వతమనీ దానిని తుడిపివేయడానికి వీలులేదనీ వివాహం తెలియజేస్తుంది. స్త్రీకి గృహిణిగా జీవితం క్లేశమైన, నీచమైన వృత్తికాదనీ తన భర్తకు కావలసిన కోర్కెలను తీరుస్తూ అతనికి పరిచర్య చేస్తూ సంతానాన్ని పెంచి పెద్దచేయడంలోనే ఆమెకు ఆనందం కలుగుతుందనీ, ఇదే వివాహం యొక్క ఆంతర్యమనీ మనం తెలిసికొనవలెను. సహధర్మచారిణిగా స్త్రీ తన సహజమాధుర్యం, సౌకుమార్యంతో భర్తకుసంసారంలో చేదోడు వాదోడుగా ఉంటూ సంఘజీవనాన్ని పటిష్ఠంచేస్తుంది. పంచమహాయజ్ఞాలను చేసి పితృదేవతలకు అతిథులకు కృతజ్ఞతను తెలియజేసే తన భర్తకు సహాయంగా ఉంటుంది. ఆమె నిస్సహాయంగా భర్తమీద ఆధారపడిన అనాథ కాదు. ఆమె గృహిణి, గృహాధిదేవత, గృహానికి సమ్రాజ్ఞి, మూర్తీభవించిన సంపద.

మాతృత్వంతో ఆమె ప్రేమపూరిత జీవితం సారవంతం అవుతుంది. తన సంతానాన్ని పెంచి పెద్ద చేయడంలో ఆమె త్యాగబుద్ధి, సేవాభావం వ్యక్తమౌతాయి. పిల్లల పెంపకంలో ఆమెకుండే సహనం, నిస్స్వార్థత బాగా గోచరిస్తాయి. పిల్లలు అధికవ్యయం చేసినా వారిని క్షమించి ఊరుకుంటుంది. అందుకే హైందవమతంలో భార్యాత్వాన్ని దివ్యప్రేమకు ప్రతీకగా భావిస్తారు. ఆజ్ఞలతో పాలించే ఈశ్వరుడు, ప్రేమతో పాలించే ఈశ్వరి—ఈ ఇద్దరు ఒకటిగా హైందవ

మైన మాతృభావమూలకంగానే ఈశ్వరుడు పాపులను క్షమించి పాపాల నుండి విముక్తుని చేస్తాడు. తల్లిప్రేమ సహజంగా పొంగిపొరలు తుంది, దివ్యమాత తన ప్రేమతో పాపులందరి పాపాలను క్షాళనం చేస్తుంది.

భర్త చూపే ప్రేమయే స్త్రీకి పెన్నిధి. అదే ఆమెకు శాశ్వతమైన సంపద. దానిని మించినది లేదు. బీదలకు ఆహారాన్ని అందజేయడం, రోగులకు పరిచర్య చేయడం, పిల్లలను పెంచి పెద్ద చేయడం మొదలైన సాంఘిక కార్యక్రమాలను చేపట్టడమే స్త్రీ విధులు కావు. ఆనందమయమైన గృహాన్ని స్థాపించి ప్రేమతో గృహాన్ని, సంఘాన్ని ఏలుకోవడమే ఆమె ముఖ్యవిధి.

చేయవలసిన మంచి పనులు కొన్ని ఉన్నట్లు, చేయకూడని లేక విడువదగిన చెడ్డ పను లున్నాయి. మంచి పనులు చేయ మని చెప్పడమే కాక చెడ్డ పనులు చేయ వద్దనికూడ శాస్త్రం శాసిస్తుంది. సత్కార్యాలు పుణ్యాన్ని కలిగించినట్లు దుష్కార్యాలు (అకార్యాలు) పాపాన్ని కలుగ జేస్తాయి. మన ఋషులు సూక్ష్మబుద్ధితో మానవుల సత్కర్మాచరణానికి నియమావళిని రూపొందించడమే కాక మిక్కిలి దూరదృష్టితో దుష్కర్మలను ఆచరింపకూడదని మనలను హెచ్చరించినారు. దుష్కర్మలు మనకు, సంఘానికి చెడుగు చేస్తాయి. పుణ్యాన్ని పోగొట్టుకోకుండా పాపాలను కోరనివాడు పాపకార్యాలను చేయకూడదు. గృహస్థుడైనవాడు పరుల భార్యలను ఆశింపరాదు. ఎవరును ఇతరులను హింసింపరాదు. అసత్యమును పలుకరాదు. అత్యవసరసమయంలో తప్ప మిగతాసమయాల్లో ఒక వర్ణానికి చెందిన మానవుడు ఇతరవర్ణాల వారి ధర్మాలను ఆచరింపకూడదు. ఇదేవిధంగా ఆహారానికి సంబంధించిన నిషేధా లెన్నోఉన్నాయి. రాజస, తామస

పశుప్రవృత్తిని ప్రకోపింప చేయరాదు, సోమరితనాన్ని, విక్షిప్తత్వాన్ని కలిగించే ఆహారాన్ని తినరాదు. మద్యపానం, చౌర్యం — ఈ రెండింటిని మన శాస్త్రాలు పూర్తిగా నిషేధించినాయి.

విధినిషేధా లున్నప్పుడు తప్పులు చేయడం మానవస్వభావం కాబట్టి మనం చేసే పనులలో కొన్ని లోపాలు, అకార్యాలు ఉంటాయి. వీటిని సరిదిద్దుకోవడాన్ని ప్రాయశ్చిత్తా లంటారు. ప్రాయశ్చిత్తంలోని అంతరార్థం ఏమిటంటే చేసిన తప్పులను తెలిసికొని పశ్చాత్తాపం పొందడము. ప్రతి మానవుడు తాను చేసిన తప్పులకు పశ్చాత్తాపం పొంది ఈ అనుభవం వల్ల లాభాన్ని, మేలును పొందవలెను. ఇది ప్రాయశ్చిత్తాలవలన కలుగుతుంది. తపస్సు, ఉపవాసాలు అనేవి సర్వ సామాన్యమైన ప్రాయశ్చిత్తాలు. వీటివల్ల ఆత్మశుద్ధి, కాయశుద్ధి, మనో శుద్ధి కలిగి మానవుడు పతితుడు కాకుండ కాపాడ బడుతున్నాడు. అయితే ఈ ప్రాయశ్చిత్తాలు అనుకోకుండా పొరపాటుతో చేసిన పాపాలను మాత్రమే నాశనం చేస్తాయి కాని బుద్ధిపూర్వకంగా చేసిన పాపాలను పోగొట్ట లేవు. బుద్ధిపూర్వకంగా చేసిన పాపాలకు జీవి తాంతం నిష్కృతి (విముక్తి) లేనే లేదు. దైనందిన జీవితంలో మనం ఎన్నో విధులను, ధర్మాలను తెలియకుండ వదలి వేస్తాము. అటువంటి విహిత కార్యాచరణలోని లోపాలవల్ల కలిగే పాపాన్ని పోగొట్టుకోవ డానికి ప్రతికార్యాంతంలోను ప్రాయశ్చిత్తాన్ని చేయడం మనకు పరి పాటి. తు చ. తప్పకుండ తమవిధులను ఆచరించడంలో మనవారు మిక్కిలి నిష్ణాతులు. ధార్మిక జీవనాన్ని గడపడానికి ప్రాయశ్చిత్తం లేక అనుతాపం చాలా ముఖ్యమైంది. మన మాచరించే వ్రతాలు, ఉపవాసాలు, ఉత్సవాలు మనలో ఆత్మశుద్ధిని కలిగించి సాత్త్విక

యొక్క ఔద్ధత్యం(శక్తి) తగ్గి మనలో పారమార్థిక తత్త్వం ఎక్కు వవుతుంది. మన మాచరించే పండుగలు కేవలం విందులు, వినోదాలు కావు. అవి మనకు దుష్టులను చంపి సజ్జనులను రక్షించి భూలోకాన్ని ఉద్ధరించిన భగవంతుని అవతారలీలలను, అద్భుతకార్యాలను ఈ లోకంలో జ్ఞాపకం చేస్తాయి. కనుక పండుగల్లో మన మా భగవంతుని దయకు కృతజ్ఞతను తెలుపుకొంటాము. మన మీ విధంగా కృతజ్ఞతను తెలియజేయకపోతే మన రక్షణకొరకు ఎన్నో పాట్లు పడిన భగవంతుని విషయంలో తప్పుచేసిన వార మవుతాము. ఉదాహరణానికి దీపావళి పండుగను తీసికొందాము. దుష్టుడైన నరకుడనే రాక్షసుని చంపి లోకానికి శ్రీకృష్ణుడు సంతోషాన్ని కలిగించినది దీపావళినాడు. రక్షకుడైన భగవంతుడు అవతారాలను ఎత్తిన జన్మదినాలను, తమ విజ్ఞానాన్ని ప్రపంచాని కందించి లోకాన్ని ఉద్ధరించిన మహాపురుషుల, యోగుల జన్మదినాలను పండుగలుగా ఆచరించడం మరొకవిధమైన పద్ధతి. ఈ కోవకు చెందినవే శ్రీకృష్ణజయంతి, శ్రీరామానుజ జయంతి మొదలైనవి.

ఆనందబాష్పాలు, రోమాంచము, పారవశ్యాలతో వెలువడే ఆత్యంతిక భక్తి కేవలం నిశ్శబ్దమైన ధ్యానము, ఉపాసనకు పరిమితం కాజాలదు. వేదాల్లో దేవతలను స్తుతిస్తూ చెప్పిన సూక్తులకు, వేదాంతంలో బ్రహ్మపరంగా అర్థం చెప్పబడినది. బ్రహ్మము దేశకాలాతీతము, రూపరహితము; కాని భక్తుల ప్రార్థనలను, కోర్కెలను తీర్చుట కనువైన రూపాన్ని బ్రహ్మము ధరిస్తాడు. భక్తిని భక్తికోసమే ఉపయోగింపవలెను. కాని భక్తులు భగవంతుని ఇహలోకములోని భౌతికసుఖముల కొఱకు ప్రార్థించినప్పుడు వాటినికూడ భగవంతుడు తీరుస్తాడు. అంతరాత్మను ఉపాసించడం చాలా ప్రశస్తము. కాని సగటు మానవున కిది సాధ్యం కాదు. అతనికి తన ధ్యానాన్ని కేంద్రీకరించడానికి ఒక ఆకారం అవసరమవుతుంది. ఇందుకుగాను దయామయుడైన పరమాత్ముడు మానవలోకంలో అర్చారూపంలో వెలుస్తాడు. అర్చారూపమంటే కేవలం లోహం లేక రాతితో చేసిన ఈశ్వర చిహ్నం అని తలంపరాదు. అది భగవంతుడు శాశ్వతంగా భూమిమీద వెలసిన దివ్యమూర్తి; అది ఆయన దయకు చిహ్నము. అర్చారూపంలో భగవంతుని అందరు అన్నివేళలా అన్నిచోట్లా సులభంగా చేరుటకు వీలవుతుంది. దేవుని చూడవలెననే భక్తుని కోర్కెకన్నా, దేవునికి తనను సదా కొలుచుచున్న భక్తుని దగ్గరకు చేర్చుకొనవలెననే కోరిక అధికంగా ఉంటుంది. తన భక్తునిలో లీనమవడానికి భగవంతుడు మిక్కిలి తహతహ లాడుతూ ఉంటాడు. భక్తి, పూజ—ఇవి రెండు భక్తునికి భగవంతుని యందుండే ప్రేమకు అంతర బాహ్య చిహ్నాలు, భగవంతుడు అపారమైన దయతో భూమికి దిగి వచ్చినప్పుడు ఆయనను యోగులు కర్మ, జ్ఞాన, భక్తి, యోగాలతో సేవించి ఆయనను చేరెదరు. భగవంతునియందు మనకున్న ప్రేమను పూజా రూపంలో వెల్లడించడానికి భగవంతుని అర్చారూపమే మిక్కిలి

భగవదారాధనను ఎన్నో విధాలుగా చేయవచ్చును భగవంతుని మనం అంతరంగధ్యానంతో కూడ పూజింపవచ్చును. ఇది కాక ఫల పుష్పాదులను సమర్పించి బాహ్యపూజ చేయవచ్చును లేక భగవన్నామ జపం చేస్తూ పూజ చేయవచ్చు. దీనిలో మొదటిది అంటే అంతరంగ ధ్యానం చాలా కష్టము, ఎందుకంటే దీనిలో మన దృష్టిని అంతర్ముఖంగా ప్రసరింప చేయవలసిఉంటుంది. రెండవపద్ధతి చాలా సులభం కాబట్టి అందరూ కష్టంలేకుండా ఈ పద్ధతిలో దేవు నరింప్చప వచ్చును. ఇక మూడవపద్ధతి చాలా సులువైనది, ఫలప్రదమైనది. అర్చారూపాన్ని (విగ్రహాన్ని) పూజించడమంటే సర్వవ్యాపియైన భగవంతుని ఆరాధించడమే. మనభక్తికి మెచ్చిన దేవుడు తన స్వరూపాన్ని తెలిపి మనలను కనికరించడానికి అర్చారూపంలో వెలుస్తాడు. ఆ యా కాలాల్లో అవసరాలనుబట్టి భగవంతుని అవతారాలు వస్తూ పోతూ ఉంటాయి. కాని, అర్చారూపంలో వెలసిన భగవంతుని ప్రేమస్వరూపము శాశ్వతమైన అవతారము. ఈ అర్చారూపం అందరికి అందుబాటులో ఉంటుంది. భక్తుల ప్రార్థనల మేరకు భగవంతుడు దయ తలచి ఈ విగ్రహాల్లో ఉంటాడు.

నారాయణుడే పరమేశ్వరు డని భావించి పూజించే పద్ధతులు రెండున్నాయి. అవి (1) పాంచరాత్రాగమపద్ధతి (2) వైఖానసాగమ పద్ధతి. పాంచరాత్రాగమం సాక్షాత్తుగా నారాయణునిచేత ఉపదేశింపబడిన సాత్త్వికమతము. వైఖానసాగమము వైఖానస మహర్షిప్రోక్తము

కల్పించబడింది. రెండవపద్ధతిలోవిపూజ గృహస్థు, అతని కుటుంబ సభ్యులకు మాత్రం పరిమితమైంది. గుడిలో జరిగే పూ ల్లో హోమం, బలి,ఉత్సవాలు ఉంటాయి. గుడిలో జరిగే పూజలకు చాలావిధాలైన విగ్రహా లుంటాయి.

దేవాలయాలు తొంభైయాగు రకాలు అవి
స్తాయి. వీటిలో 18 విష్ణువుక
బడినాయి. గర్భగృహం,
లయంలోని ముఖ్యభాగాలు.
విమానం కట్టబడి ఉంటుంది
ఉంటుంది. ప్రాకారాలు దే
ఏడువరకు ఉంటాయి.

దేవాలయాలలోని
వాటిలో స్థిరంగా ఉండే
వీలయ్యే ఉత్సవ విగ్రహా
లను స్థానక (నిలుచుకొ
కొని ఉండే భంగిమలో
ప్రతి విగ్రహం మూడు
భోగ (ఆనందరూపంలో

ఆగమాలు దేవా
యాల నన్నింటినీ విపులంగా వర్ణిస్తాయి. వీటిలో దేవాలయంల ప వివిధభాగాలైన విమానం, ప్రాకారం, గోపురం మొదలైన వాటి యొక్క పరిమాణాలు, స్థానాలు చెప్పబడినాయి. భగవంతుడు వివ

పట్టణం మధ్యలో ఆధ్యాత్మికదృష్టితో నిర్మించబడుతుంది. ముఖ్య దేవత(ఆదిమూర్తి)తోపాటు భగవదవతారాలైన ఆళ్వార్లు, నాయనార్లు, ఆచార్యులు మొదలైన వారికికూడ ఆలయాలు నిర్మించ వచ్చును. దేవాలయమంతా ధార్మికవాతవరణంతో నిండి ప్రతిపనీ ఆరాధనగా చూడబడుతూ ఉంటుంది: భగవదారాధన ఆధ్యాత్మికతను సంతరించు కొంటుంది.

దేవాలయాల్లో చేసే ఉత్సవాలు సర్వప్రజానీకంయొక్క క్షేమానికి ఉద్దేశింపబడినాయి. ఇవి నియమితకాలంలో వచ్చేవి, అప్పుడప్పుడు వచ్చేవి అని రెండువిధాలుగా ఉంటాయి. ఆలయంలోని అంతర్భాగంలో ఉండే మూలవిరాట్టును చూడడానికి భక్తులు ఆతురతతో ఉంటే ఉత్సవమూర్తిరూపంలో ఉండే దయామయుడైన భగవంతుడు ఆలయం వెలుపలఉన్న భక్తులను కలుసుకొని వారిని దీవించి ఉద్ధరించవలెనని తహతహ లాడుతూ ఉంటాడు. పూర్ణిమ, విషువత్తు మొదలైన పర్వదినాలలోను, ఆ యా ప్రత్యేక కాలాలలోను చేయబడే ఉత్సవాలే కాక ఏ కాలంలోనైనా భక్తి సూచకంగాను, క్షామం మొదలైన అపదలను పోగొట్టడానికి ఉత్సవాలను ఆచరింపవచ్చును. ఒక్కొక్క ఉత్సవానికి కాలపరిమితి 15 నుంచి 30 దినములవరకు ఉండవచ్చును. ఉత్సవాలు జరుగుతున్నందుకు గుర్తుగా గుడిముందు ధ్వజం ఎగురవేయబడుతుంది; ఉత్సవం ముగిసిన వెంటనే దాన్ని దించివేస్తారు. ధ్వజారోహణం తరువాత ధ్వజాన్ని దించేవరకు ఆ ఊళ్లోని వారెవ్వరూ ఊరు విడిచి వెళ్లరాదు. దీనిని బట్టి ఉత్సవాలు ప్రజలకోసం ఉద్దేశింపబడినాయని చెప్పవచ్చును. భక్తిసూచకాలైన ఉత్సవాలను మధ్యాహ్నం తరువాత చేయవలెను.

దేవాలయం యొక్క పవిత్రతను కాపాడడం కోసం ప్రత్యేక మైన శ్రద్ధ తీసికొనబడుతుంది. ఏమైనా అపవిత్రమైన పనులు జరిగి నప్పుడు అపవిత్రతను పోగొట్టడానికి ప్రాయశ్చిత్తాలు శాంతి సంప్రో క్షణలు విధింపబడినాయి. నిత్యపరిశుద్ధుడు, సర్వావగుణ వర్జితుడైన భగవంతుడు తన స్థానం అపవిత్రమైతే విడిచిపోతాడు కాబట్టి భగ వంతుని శాశ్వతంగా నిలుపు కోవడానికి పవిత్రత దాని పరిరక్షణకోసం ప్రాయశ్చిత్తాలు విధించ బడినాయి. దేవాలయంలోనికి భక్తులు పరి శుద్ధమైన దేహాలతో, నిర్మలమైన మనస్సుతో ప్రవేశింపవలెను. పరి శుద్ధత దైవత్వానికి దారితీస్తుంది. బాహ్యాభ్యంతరాలలో శుచిగా ఉన్న వారు దేవుని చేరగలరు. దేవాలయపరిసరాలు అపవిత్రమైనప్పుడు వాటిని పరిశుద్ధిచేయడానికి కొన్ని కార్యకలాపాలు నిర్వహింప బడు తాయి. అశుచిగా ఉన్నవారు పశువులు ఆలయంలోనికి ప్రవేశించి నట్లయితే వాటికి కొన్ని ప్రాయశ్చిత్తాలు విధించబడినాయి. గుడిలో కుక్కగొడుగులు, పాముపుట్టలు కనిపిస్తే కూడా ప్రాయశ్చిత్తం చేయ వలసి ఉంటుంది. దేశానికి అరిష్టం సూచించే దుశ్శకునాలు, కీళ్లు సంభవించినప్పుడు కూడ వాటి దుష్ఫలితాలను పోగొట్టడానికి శాంతు లను చేస్తారు.

భారతదేశం సార్వజనీనమైన హిందూమతానికి పుట్టినిల్లు. ఇది అవతారాలు, ఋషులు, ఆళ్వారులు, నాయనార్లు, ఆచార్యులు, యోగులు మొదలైనవారి పుట్టుకతో పవిత్రమైన దేశము. భగవదవతారాలు, దివ్యపురుషుల జన్మస్థలాలను క్షేత్రాలు అని అంటారు. ఈ పవిత్ర భారతదేశంలో ఇదివరలో తరతరాలుగా చాలామంది ఋషులు

దగినది కాళిపట్టణము. ముక్తినిచ్చు క్షేత్రాలలో ముఖ్యమైనది కంచి.

భగవంతుని అర్చారూపాలను అయిదు రకాలుగా పూజిస్తారు. వీటిలో తిరుపతిలో వెలసిన స్వయంవ్యక్తవిగ్రహం చాలా ముఖ్యమైనది. భగవంతుడు తన అపారమైన కరుణతో జీవులందరికి విముక్తిని కలిగించడానికి దివినుండి భువికి దిగివచ్చి ఇక్కడ వెలసినాడు. తన పాదాలు చేరి తన అనుగ్రహాన్ని పొందుమని ఆయన కొండపైనుండి జీవులందరిని ఆహ్వానిస్తున్నాడు. శ్రీరంగం, పుష్కరం, మేల్కోట, నైమిశము మరికొన్ని దివ్యక్షేత్రాలు బ్రహ్మదేవునిచేత ప్రతిష్ఠింపబడినవి. వరదరాజస్వామికి నిలయమైనది దివ్యక్షేత్రమైన కాంచీపురము. ఋషిచేత నిర్మింపబడినది కాబట్టి తిరువళ్ళూరు ఆర్ష క్షేత్రము. సజ్జనులచేత నిర్మింపబడినది మానుషక్షేత్రము. ఎవరిచేత నిర్మింపబడినదో తెలియుటకు వీలులేని దేవాలయము లున్న తావులను పుణ్యక్షేత్రాలు అంటారు. మనదేశంలో చాలా ఆలయాలు ఈ తరగతికి చెందినవే. ఇటువంటి శైవక్షేత్రాలుకూడ ఉన్నాయి. వీటిలో శివుడు పృథివి, అప్పు(నీరు), తేజస్సు, వాయువు, ఆకాశము అనే పంచభూతాల రూపంలో ప్రత్యేకంగా పూజింపబడుతున్నాడు. వీటిలో ఆకాశలింగ క్షేత్రమైన చిదంబరం చాలా ముఖ్యమైనది. ఉత్తరంగా బదరీనాథ్, కేదారనాథ్‌లనుండి ప్రారంభించి మధ్యలో కాశీనాథ్, మధురానాథ్, అయోధ్యానాథ్‌లకు, పశ్చిమంగా పండరీనాథ్, ద్వారకనాథ్‌లకు తూర్పున జగన్నాథ్‌కు, దక్షిణంగా వేంకటనాథ్, కాంచీనాథ్, రంగనాథ్, రామనాథ్‌కు భక్తుల యాత్రలు వ్యాపించినాయి. జీవుడప్పుడు ఆభ్యంతర దేవాలయాన్ని ప్రవేశించి నిత్యత్వాన్ని చేరుకొంటాడు.

పురుషుల సంసర్గంవల్ల లేక మహాక్షేత్రంలో ఇవి ఉండటంవల్ల వీటిలోని జలాలు పవిత్రమైనవి. ప్రతిక్షేత్రంలోను ఒక తీర్థం ఉంటుంది. దీనిలో స్నానం చేస్తే పాపాలు నశిస్తాయి. తిరుమలక్షేత్రంలో స్వామి పుష్కరిణి ఉంది. అందరూ దానిలో స్నానం చేసి పవిత్రులై దేవాలయంలో ప్రవేశింపవలెను. గంగానది స్వర్గలోకంలో విష్ణువు పాదాలనుండి పుట్టి భూమికి దిగివచ్చింది. కాబట్టి అది పవిత్రమైన నది అంటారు. దానిని భగీరథుడు, సగరుని పదివేలమంది పుత్రుల పాపాలను క్షాళనం చేయడానికి, మిక్కిలి కఠినమైన తపస్సు చేసి భూమికి తీసికొని వచ్చినాడు. అదేవిధంగా గోదావరి, కావేరి నదులు కూడ పవిత్రమైనవి.

క్షేత్రాలకు యాత్రగా వెళ్ళడం జీవాత్మ పరమాత్మను చేరే యాత్రకు ప్రతీక అని అంటారు. మానవజీవితధ్యేయం, గమ్యం పరమాత్మను చేరడమే. క్షేత్రాలను దర్శించడంవల్ల భక్తునిలో ఉండే అపవిత్రభావాలు, దుర్గుణాలు నశిస్తాయి, కోర్కెలమీద అనురాగం తగ్గి వైరాగ్యం కలుగుతుంది; సత్త్వగుణం వృద్ధి చెంది సహనము, ఓర్పు పెంపొందుతాయి. మహాత్ములను కలుసుకోవడంతో సర్వమానవ బాంధవ్యము ఇనుమడిస్తుంది. కనుకనే భక్తిభావాన్ని తమలోను ఇతరులలోను పెంపొందించడానికి ఆళ్వారులు, నాయనార్లు, ఆచార్యులు హిమాలయంనుండి సేతువువరకు తీర్థయాత్రలు చేసేవారు.

---

మతంలో ఎంతో విలువ ఉంది. ధర్మార్థకామాలు తమంతట తామే పరమప్రయోజనాలు కావు. అవి, అన్నిటికన్నా ముఖ్యమైన పురుషార్థం అంటే మోక్షముయొక్క ప్రాప్తికి సహకరిస్తాయి. మోక్ష మంటే ఆత్మను సంసారానికి బంధించే అవిద్య, కర్మలను తొలగించుకొనడము. ఆత్మ అనేది వాస్తవంగా భగవంతునికి సంబంధించినది. కాని అది ఎట్లో 24 తత్త్వాలతో కూడిన ప్రకృతిచేత సృష్టింపబడిన దేహంతో అనాదిగా తాదాత్మ్యాన్ని పొందినది. భౌతికమైన ఈ భ్రమపూర్వక దృష్టివల్ల ఆత్మ ప్రకృతిపరిణామాలకు, జననమరణాలకు, సుఖదుఃఖాలకు గురి అవుతున్నది. చాలాకాలం తరువాత జీవుడు, తాను భగవంతునిలోని తన శాశ్వతస్థానాన్ని వదలుకొన్నానని, భగవంతునితో తెగతెంపులు చేసికొన్నానని తెలిసికొని తిరిగి యథాస్థానాన్ని పొందవలెనని తహ తహ లాడుతాడు. ఇదేవిధంగా భగవంతుడు కూడ జీవుల అంతరాత్మగా, ఉద్ధారకుడుగా వారితో పునరైక్యం కావడానికి ఎంతో ఆత్రముతో ఎదురుచూస్తు ఉంటాడు. ఈ అర్థంలో భగవద్గీత కర్మ, రాజ, జ్ఞాన, భక్తి యోగాలను బోధిస్తున్నదని మనం తెలిసికొనవలెను. యోగమంటే భగవంతునితో ఐక్యం పొందుట. అన్ని యోగాలు ఇదే విషయాన్ని చెప్పుతాయి పైన చెప్పిన యోగాలు నిచ్చెనలోని మెట్ల వలె ఆరోహణక్రమంలో ప్రతిమతంలోను చెప్పబడినాయి. వీటిలో ప్రతి ఒక యోగము స్వతంత్రమైనది, సాక్షాత్తుగా ముక్తి నిచ్చేది అని అంటారు. శ్రీవైష్ణవసిద్ధాంతం ప్రకారం భగవంతుని చేరడానికి కర్మ, జ్ఞానము, భక్తి అనేవి మూడు మజిలీలు. ముందు కర్మాచరణలో క్రమశిక్షణ నేర్పాటు చేసికొని తరువాత మన సంకల్పాలను, ఆలోచనలను చక్కచేసికొని చివరకు భక్తిని అలవరచుకోవడమే ఈ యోగాల క్రమంలో ఉండే ఉద్దేశము. ప్రపత్తి ద్వారా భగవంతుని సులభంగా చేరవచ్చును. తత్ఫలితంగా భగవదనుగ్రహం కలిగి ముక్తి కలుగుతుంది.

చిత్తశుద్ధిని కలిగించే ధార్మిక(నైతిక) శిక్షణకు కర్మయోగమని పేరు. కామ్యకర్మలను నిష్కామకర్మగా (ఫలాన్ని అపేక్షించకుండా కర్మలను చేయుట) మార్చడమే దాని లక్ష్యము. ఏ మానవుడుకూడ కర్మలను ఆచరింపకుండ ఉండలేడు. మానసిక, వాచిక, శారీరక వ్యాపారాలు కూడ కర్మలు అనబడుతాయి. ప్రతి మానవుడు సాధారణంగా ఇంద్రియసుఖాలను కోరుతూ పశువాంఛలను కలిగిఉంటాడు. ఇతడు ఇంద్రియసుఖాలనే కాక జయము, లాభము, పేరు ప్రతిష్ఠలు మొదలైన వాటినికూడ సంపాదింపవలె నని కోరుతాడు. వీటిని సాధించడానికి చేసే కర్మలకే కామ్యకర్మలని పేరు. ఇవి ఇంద్రియ సుఖేచ్ఛమీద ఆధారపడిఉంటాయి. ఈ కామ్యకర్మలు మానవుని ఇంద్రియసుఖాలకు, భౌతికసుఖాలకు బానిసగా చేస్తాయి కాబట్టి ఇవి కోరదగినవి, ఆచరింపదగినవి కావు. కోరినకోర్కెలు సిద్ధింపక పోయినప్పుడు క్రోధం కలుగుతుంది. క్రోధంవల్ల మోహం, దానివల్ల స్మృతివిభ్రమం, దానివల్ల నైతికపతనం కలుగుతుంది. అందుకే భగవద్గీత నిష్కామకర్మను మనకు నైతికమార్గంగా ఉపదేశిస్తుంది. కర్మలను ఆచరింపకుండ ఎవరును ఉండ లేరు. కాని నిష్కామకర్మ వలె కర్మఫలితాన్ని ఆశింపక కర్మలను ఆచరింప వలెను. కర్మలను కర్మలకొఱకే ఒక విధిగా, ధర్మంగా ఆచరింపవలెను. ఆ విధంగా కర్మలను ఆచరించే కర్మయోగి ఇంద్రియాలకు బానిస కాడు. ఇంద్రియాలను జయిస్తాడు. ప్రతి మానవునికి కొన్ని ఆశ్రమాలు (బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థం మొదలైనవి), వాటిలో ఆచరింప వలసిన విధులు (ధర్మాలు) ఉంటాయి. మానవుడు వాటి ఫలితాన్ని లెక్కింపకుండా విధులుగా ఆచరింపవలెను. ఆ విధంగా ఆచరించి

కర్మకు మూడు అర్థాలు ఉన్నాయి. కర్మ అంటే ఒక కారణము లేక కారణములవల్ల కలిగిన ఫలితమని అర్థమవుతుంది. ఇది ముందుకు ఆచరింపవలసిన కార్యాన్ని కూడ నిర్ణయిస్తుంది. ఈ విధంగా కర్మకు అవిచ్ఛిన్నత్వం ఏర్పడుతుంది. ఏ మానవుడుకూడ తన వెనుక జన్మలో చేసిన కర్మల ఫలితాన్ని తప్పించుకోలేడు. అతడు విధికి తల వంచ వలసినదే. కాని నైతికమైన ఉన్నతార్థంలో కర్తచేసే పనిని కర్మ అని, కర్త నైతికంగా స్వతంత్రుడనీ, తన భవిష్యత్తును తనకు తోచిన విధంగా నిర్ణయించుకోవడానికి అతనికి అధికారం, స్వేచ్ఛ ఉన్నాయనీ అంటారు. కర్మలను ఒక తూరి ఆచరిస్తే తరువాత వాటి ఫలితాన్ని తప్పించుకోవడానికి వీలుపడదు. మొలచే చెట్టు నాటే విత్తనాన్నిబట్టి ఉంటుంది అని అన్నట్లుగా మనం చేసిన కర్మలకు తగినట్టి ప్రతిఫలం లభిస్తుంది. మనం చేసే కర్మలు మంచివిగాని, చెడ్డవి గాని వాటి ఫలితం తప్పించుకోవడానికి వీలుకాదు. మానవుడు చేసే కర్మలను బట్టి అతని శీలాన్ని నిర్ణయిస్తారు. కాని కర్మను నిష్కామకర్మగా ఆచరిస్తే కర్మఫలాపేక్ష ఉండదు కాబట్టి మానవునికి బంధం ఉండదు. కామ్య కర్మ లతనిని బంధింపవు. ఉన్నతార్థంలో ప్రతి కర్మ భగవదారాధనమే; ప్రతి కర్మ భగవదర్పణంగా భగవంతునికి కైంకర్యం చేయడమే అవుతుంది. తాను చేసే పనిఅంతా భగవంతునిచేత చేయబడుతుందనీ, తాను కర్తకాదనీ తాను చేసే పని అంతా భగవంతుని పూజించడమేనని, "సర్వం కృష్ణార్పణం" అనే భావాన్ని అలవరచుకొంటాడు. యథార్థంగా చూస్తే వైయక్తిక సాంఘిక జీవితంలో ఈశ్వరుడే కర్త. మన దేహం. ఇంద్రియాలు, మనస్సు, ఆత్మ-ఇవి అన్నీ కర్మాచరణకు తోడ్పడినప్పటికి ఈశ్వరుడే అన్నిటికి కర్త సాధనం, లక్ష్యం కూడ. ఈ అర్థంలో కర్మయోగం ముక్తికిసాక్షాన్మార్గము అని తెలుస్తుంది. కాని ఇది ధార్మిక జీవనంలో చివరి

నిలకడగా అటు పిటు పోనివ్వకుండడము. ఇది బ్రహ్మసాక్షాత్కారానికి రాజమార్గము. మనస్సు సాధారణంగా అటు నిటు తిరుగుతూ చంచలంగా ఉంటుంది. అటువంటి మనస్సును బిగబట్టి భగవంతునిమీద కేంద్రీకరించడమే ఈ యోగంయొక్క ఉద్దేశము. కనుకనే మానసిక ప్రవృత్తి మీద ఆధారపడిన రాజయోగం నైతికమైన కర్మయోగము కంటే భిన్నమైనది. దీనిలో యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి అనే ఎనిమిది దశలున్నాయి. యోగ సాధనకు మానసిక, దైహిక శుద్ధి చాల ముఖ్యము. పైన చెప్పిన ఎనిమిది దశలలో మొదటి నాలుగు దేహశుద్ధికి, ప్రాణాయామానికి సంబంధించినవి. మిగిలిన నాలుగు చిత్తశుద్ధికి సంబంధించినవి. చివరకు మనస్సు వికసించి సమాధిని శాంతిని పొందుతుంది. ఈ వికాసాన్ని భౌతికంగా మానసికంగా కూడ వివరింపవచ్చును. దేహం లోని అధోభాగంలో వెన్నుపాము (మేరుదండం) లోని మూలాధారం నుండి మెదడులోని సహస్రారంవరకు నాడుల ద్వారా ఆధ్యాత్మికశక్తి ప్రసరించడమే మానసికవికాసము. మానసికదృష్టితో చూస్తే ఈ దశలో చైతన్యం అధోస్థితినుండి ఉన్నతస్థితికి వికాసం చెందుతుంది. అప్పుడు యోగికి పరకాయ ప్రవేశంవంటి సిద్ధులు, ప్రకృతిమీద ఆధిపత్యం లభిస్తాయి కాని ఈ సిద్ధులు ఆధ్యాత్మికజీవనానికి, భగవంతునితో ఐక్యానికి ప్రతిబంధకాలు అవుతాయి. కనుక వీటిని విడువవలెను. ఆత్మజ్ఞానాన్ని బోధించడానికి, ఆత్మఔన్నత్యాన్ని తెలిసికోవడానికి యోగం ఉపకరిస్తుంది.

జ్ఞానయోగ మంటే జీవుని తత్త్వాన్ని, జీవబ్రహ్మలకు ఉండే సంబంధాన్ని గురించి తెలుసుకోవడానికి ఉపయోగపడే ఆధ్యాత్మిక విచారము. ఇది కేవలం బుద్ధికి సంబంధించినది కాదు. ఇది వివేకము, వైరాగ్యము, అభ్యాసాలమీద ఆధారపడిన

ఆధ్యాత్మిక విచారము. వివేకంవల్ల యోగికి నిత్యమైన ఆత్మకు అనిత్యమైన ఆత్మకు భేదం తెలుస్తుంది. వైరాగ్యంవల్ల తానే దేహ మనుకొనే భ్రమను పోగొట్టుకొని అహంకారాన్ని వదలుకోవడానికి ప్రయత్నిస్తాడు. ఆత్మను గురించి ధ్యానం చేయడమే అభ్యాసము. చివరికతనికి ఆత్మజ్ఞానం కలిగి శాంతి లభిస్తుంది. ఇటువంటిజ్ఞానం కేవలమొక దశను సూచిస్తుందే కాని ఆత్యంతికమైన అంతిమ స్థానం కాదు. ఈ జ్ఞానం బ్రహ్మజ్ఞానాన్ని (అంటే బ్రహ్మసాక్షాత్కారాన్ని) కలుగజేయవలెను. అద్వైతసిద్ధాంతం ప్రకారం జ్ఞానయోగానికి వేరే అర్థం ఉంది. అద్వైతమతరీత్యా యోగాలన్నిటిలోను ఉత్తమమైనది జ్ఞానయోగము. జీవుడు ఈశ్వరుడు ఒకరే, భిన్నులు కారు అనే ఐక్యతతో కూడిన అనుభూతి కలగడమే జ్ఞానము. కాని జ్ఞానమార్గం కంటే భక్తిమార్గం ఉత్తమ మని శ్రీకృష్ణుడు సెలవిచ్చెను.

భగవంతునియందు భక్తిని కలిగి ఉండడమే భక్తియోగము. భగవంతుడు ఉత్కృష్టపురుషుడే కాని నిర్గుణుడు, రూపం లేనివాడు కాదు శ్రీ రామానుజులు శ్రీ భాష్యంలో మొదటి ప్రార్థనా శ్లోకంలో చెప్పినట్లు చరాచరప్రపంచానికి బ్రహ్మము సృష్టిస్థితిలయకారకుడు. జగత్పాలన అనేది జీవుల నుద్ధరించడానికి ఆయన తలపెట్టిన లీలా కార్యము. ఉపనిషత్తులలో చెప్పబడిన బ్రహ్మము దయామూర్తియైన శ్రీనివాసుడే. భక్తిని కలిగి, దాని నలవాటుచేసికొనడంలో వివేకము విమోకము, అభ్యాసము, క్రియ, కల్యాణము, అనవసాదము, అనుద్ధర్షము అనే ఏడు దశలున్నాయి. సూక్ష్మంగా వీటి కర్థం ఇట్లు చెప్పవలసి వస్తుంది. సాత్త్వికాహారం తీసికొనడం, ఇంద్రియ సుఖాపేక్ష విడిచిపెట్టడం, భగవంతుడు సర్వత్ర ఉన్నాడనే భావాన్ని మననం చేసికొనడం, శాస్త్రాలలో చెప్పిన విధుల నాచరించడం, సత్యాన్ని

పాసనను నేర్పుతాడు. అప్పుడు భక్తి భగవంతునితో ఐక్యం కావడానికి తహతహలాడే పరమభక్తిగా మారుతుంది. భక్తుడు హనుమంతునివలె భగవంతునికి దాసుడుగా ఉండవచ్చును. అర్జునునివలె మిత్రుడుగా ఉండవచ్చును. కృష్ణుని యెడల యశోద లేక పెరియాళ్వార్ చూపినట్లు తల్లిప్రేమను చూపవచ్చును లేక నాయికగా ఆండాళ్ తన నాథుని ప్రేమించినట్లు ప్రేమింపవచ్చును.

జ్ఞానముచేత వెలిగింపబడి కఠినమైన క్రమశిక్షణతో కూడినదే భక్తియోగము. దీన్ని ద్విజులు మాత్రమే అనుసరింపకలుగుతారు. ఇంతకన్నా సులభమైన పద్ధతి ఒకటి శ్రీవైష్ణవమతంలో ఉంది. దీనినే ప్రపత్తి అంటారు. భగవంతుడే శ్రియఃపతి. సర్వలోక శరణ్యుడైన భగవంతుడు జీవులనందరిని ఉద్ధరించడానికి రామకృష్ణాద్యవతారాల నెత్తెను. భగవద్గీతలో (18—66)

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వాం సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః."

— అన్ని ధర్మాలను విడిచి ;
పాపాలనుండి రక్షిస్తాను అని ;
లేక శరణ్యుడు. ప్రపత్తియో
భగవంతుని వాత్సల్యంలో
సంపూర్ణంగా ఆయన శరణుకొ
ఎవరిని ఉద్ధరింపదలచుకొంటే
కుంటాడు. ప్రపత్తి అనేది ఎక్కి, ఎలు, ఋలి.
లేకుండా అందరికీ ఉద్దేశింపబడింది. ద్వయ మనేది
మైన మంత్రము. అంటే శ్రీమన్నారాయణ, శ్రీదేవిని

నమ్మాళ్వార్ ఇందు కుదాహరణము. అన్ని మతాలవారు తిరుమలలోని శ్రీనివాసుని దయను పొందడానికి ప్రయత్నిస్తారు. విష్ణుసేవకు ప్రాముఖ్యాన్నిచ్చే మధ్వమతస్థులకు కూడ తిరుమల పవిత్రమైన క్షేత్రము.

శైవసిద్ధాంతంలో శివుడు పరమేశ్వరుడని, చర్య, క్రియ, యోగ, జ్ఞానము అనే నాలుగు సాధనాలతో శివుని పొందవచ్చునని అంటారు. ఈ నాలుగింటిని ఇంతకుముందు చెప్పిన కర్మ, రాజ, జ్ఞాన, భక్తి యోగాలతో పోల్చవచ్చును. అద్వైతాచార్యులైన శ్రీ శంకరులు కూడా వ్యవహారదశలో హస్తపాదాద్యవయవాలతో రూపధారియైన ఇష్టదైవాన్ని వివిధస్తోత్రాలలో సగుణబ్రహ్మయైన భగవంతునిగా గుర్తించి ఆయన వాత్సల్యాన్ని దయను ప్రసాదింపమని వేడుకొన్నాడు. ఇష్టదైవంలో బ్రహ్మమును చూచుకుంటూ గురువు ద్వారా ఆయన దయను పొంది మోక్షాన్ని పొందడంలో హిందువు లందరికీ నమ్మకం ఉంది.

ప్రతి జంతువుకూడ ఒక గమ్యాన్ని ఏదో విధంగా తనకు తెలియకుండానే చేరుతుంది, కాని మానవుడు తన గమ్యంయొక్క స్వభావాన్ని బాగా తెలుసుకొంటాడు. అతనికి యుక్తాయుక్తజ్ఞానం, వివేకం ఉన్నాయి. గమ్యాన్ని గుర్తించుకోవడమే పురుషార్థము అంటారు. పురుషార్థమంటే మానవుని జీవితంలో ముఖ్యంగా ఉన్నత స్థాయిలో పొందదగినది లేక చేరదగినది. మానవుని దేహధారణకు నీరు, నిప్పు, గాలి, గుడ్డలు అవసరము. అతడు శాశ్వతంగా సుఖాలుండవలెననీ కష్టాలు రాకూడదనీ కోరుతాడు. ధర్మార్థకామమోక్ష అనే నాలుగు పురుషార్థాలున్నాయి. అవి వేటికవీ స్వతంత్రమైనవి కావు. అవి పరస్పరపూరకాలు. మొదటి మూడు పరమప్రయోజనమైన మోక్షాన్ని పొందడానికి ఉపకరిస్తాయి.

ధర్మమంటే మానవ జీవితంయొక్క నైతికగమ్యం లేక ప్రయోజనము. ధర్మబద్ధంకాని జీవితం లేదు. కాబట్టి పురుషార్థాల్లో ధర్మానికి ప్రథమస్థానం ఇవ్వబడింది. ధర్మాచరణమే జీవితసర్వస్వము. అంతే కాక మిగతపురుషార్థాలు కూడ ధర్మబద్ధంగా ఉండవలెను, బౌద్ధ, జైన మతాలు కూడా ధర్మాచరణానికి ప్రాముఖ్యాన్నిచ్చినాయి. కాని మంచితనమే చివరికి దైవత్వంగా పరిణమిస్తుందనే దాన్ని ఈ మతాలు ఒప్పుకోవు. ఈశ్వరుడు కృపామయుడు. మంచితనానికి దైవత్వం పరాకాష్ఠ. దైవత్వాన్ని శాస్త్రాలద్వారా చేరుకోవచ్చును. తప్పక ఆచరింపవలసిన ధర్మాలను బోధించేది శాస్త్రము. ఈ ధర్మాలకే విధులని పేరు. అంటే ఇవి తల్లిదండ్రులు, గురువులు, ఋషులు మొదలైన వారి విషయంలో గౌరవం కలిగి ఉండడం, సత్యాన్ని పలకడం దానం, శౌర్యం, దయ ఇత్యాది గుణాలుకలిగి ఉండడం అనే రూపాల్లో ఉంటాయి. పంచయజ్ఞాలను చేసి దేవతలను, పితృదేవతలను క్రిమి కీటకాదులను, పశుపక్ష్యాదులను తృప్తి పరచడం కూడ ధర్మం అనబడుతుంది. దీని

సహాయపడవలెను అనే విషయం బాగ తెలుస్తుంది. ఈ చెప్పిన విధులను ఆచరింపలేకపోవడమే అధర్మము. దీనివల్ల పాపం కలుగుతుంది. దుష్టత్వం, పాపం కలసి అధర్మ మవుతుంది. అధర్మాన్ని దుష్టత్వమని నైతికార్థంలో, పాపమని ఆధ్యాత్మికార్థంలో అంటారు. ధర్మకార్యాల నాచరిస్తే ధర్మం కలుగుతుంది. ధర్మకార్యాలను చేసినవారు శ్రీరాముని వలె ధర్మమూర్తు లనిపించుకొంటారు. శ్రీరాముడు సత్యాన్ని, వ్రత పరిపాలనాన్ని, ప్రాణిదయను, ఆత్మనిగ్రహాన్ని అలవరచుకొన్నాడు. అర్థకామాలను ధర్మానికి అనుగుణంగా మలచుకొన్నాడు. కనుక ధర్మమంటే ధర్మాన్ని ధర్మంకోసమే ఆచరించడ మని అర్థము.

అర్థం కూడా ఒక పురుషార్థం, దీన్ని అందరూ కావాలంటారు. విద్యాభ్యాసాన్ని పూర్తిచేసిన విద్యార్థి వెంటనే గృహస్థాశ్రమాన్ని స్వీకరింపవలెను. ఆ తరువాత కష్టపడి న్యాయార్జితమైన ధనంతో సంసారాన్ని పోషింపవలెను. ధనమే పరమ పురుషార్థం కాదు; ధనాన్ని దాన భోగాల కుపయోగింపక దాచిపెట్టిన లోభిని అధర్మవంతుడు లేక సంఘవ్యతిరేకి అని అంటారు. గృహస్థు ఆతిథ్యాన్నిస్తూ కావలసిన వారి నాదుకొంటూ దేవతలకు పితృదేవతలకు తన ధర్మాన్ని నెరవేర్చవలెను. ప్రతి విధికూడ భగవదారాధనమే. కనుక లౌకిక వైదిక విధులలో ఏమీ భేదం లేదు. కర్మలు మూడు విధములు. సంధ్యావందనం మొదలైనవి నిత్యకర్మలు; పితృకర్మలు మొదలైనవి నైమిత్తిక కర్మలు, కోర్కెలు తీరడానికి చేసేవి కామ్యకర్మలు. నిత్య నైమిత్తిక కర్మలను విడువ కూడదు. కామ్యకర్మలను కావలసిన వారు అనుష్ఠింపవచ్చును లేనివారు విడచిపెట్టవచ్చును.

లోకంలోను సుఖాలను అనుభవించడానికి కామ్యకర్మలు ఆచరింపబడు తాయి. కాని అనుభవాలు క్షణికమైనవి, తుచ్ఛమైనవి కనుక జ్ఞాని యైన వాడెవ్వడూ ఈ తుచ్ఛభోగాలను కోరకుండా శాశ్వతమైన ముక్తిని అపేక్షిస్తాడు.

కైంకర్యమంటే జీవులందరికీ సహాయపడుతూ వారికి సేవ చేయడము; ఇదియే మాధవసేవ. భగవద్భక్తులైన ఆళ్వార్లు, ఆచార్యులు సమస్తప్రాణులలో దేవుని, దేవునిలో సమస్తప్రాణులను చూచి సేవా భావాన్ని కైంకర్యమనే ఉన్నతస్థాయికి తెచ్చిరి. దేవుని శరణు పొందడం కూడ ఒక పురుషార్థము.

సాధనాలను అభ్యసించిన ముముక్షువు చివరకు మోక్షాన్ని పొందుతాడు. మోక్షమంటే జీవుడు అవిద్య, కర్మలనుండి విడి పోవడము. అంటే జననమరణాలనుండి, సంసారబాధలనుండి తప్పించుకొనడము. ముక్తికి వ్యతిరేకార్థముకూడ ఉంది. ఎందు కంటే జననమరణము లుండే ఈ ప్రపంచానికి తిరిగి రాకుండా ఉండడమే ముక్తి అని ఇంతకు మునుపే చెప్పితిమి. ముక్తిలో కాల, దేశావధుల కతీతంగా ఉండే బ్రహ్మలోకాన్ని జీవుడు అధిరోహిస్తాడు. కనుక ముక్తికి భావార్థం కూడ ఉంది. ఇంకొక విధంగా చెప్పవలెనంటే ఏ బ్రహ్మమును తెలిసికొంటే మిగత అంత తెలుస్తుందో ఆ బ్రహ్మ మును పొందడమే మోక్షము లేక ముక్తి. ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రాలు, భగవద్గీతలలో చెప్పబడినట్లు, దేహాన్ని వదలిన ముక్తుడు దైవసహాయంతో అర్చిరాదిమార్గంద్వారా దివ్యమైన ఉపదిష్టద్వారా

తరువాత ముముక్షువుకు బ్రహ్మనాడి గోచరిస్తుంది. ఈ నాడి జీవుని మార్గంలో కాంతులను ప్రసరింపచేస్తుంది. ఈ కాంతిసహాయంతో జీవుడు ఇంద్ర, సూర్యలోకాల గుండా విరజానదిని చేరి ఆ నదిలో స్నానం చేసి అవిద్యాకర్మలను పోగొట్టుకొని వైకుంఠం చేరి బ్రహ్మను ముఖాముఖిచూచి ఆయనతో ఐక్యం పొంది శాశ్వతానందాన్ని పొందుతాడు. ఈ క్రమాన్ని గురించి ఉపనిషత్తులు చెప్పే భాష దేశ కాలాద్యవచ్ఛిన్నమైనందున జీవుని బ్రహ్మలోకప్రాప్తిని వర్ణించడం మానవులతరం కాదు. వైకుంఠం దేశకాలావధులను, మనసును, దేహాన్ని దాటి ఉంటుంది; దానిలోని బ్రహ్మకు విశిష్టమైన దేహముంటుంది. ఆ బ్రహ్మము నిత్యుడు, స్వయంప్రకాశము కలవాడు, ఆనందస్వరూపుడు. ముక్తుడైన జీవు డాయనతో ఐక్యమును పొంది అమృతుడై శాశ్వతానందంతో ఉంటాడు. అతి దీ కర్మభూయిష్ఠమైన ప్రపంచానికి తిరిగిరాడు. అతనిని ప్రకృతి, కాలము బంధింప లేవు. జీవుడు శాశ్వతానందంలో బ్రహ్మతో ఐక్యం పొందినప్పటికి తాను ప్రత్యేకంగా ఉంటాడు. తమ కోర్కెలు నెరవేరడంవల్ల ముక్తులు ఆధ్యాత్మికంగా బ్రహ్మతో ఐక్యం పొందుతారు. అహంకారం లేకుండా వారు భగవంతుని ఆరాధిస్తూ తమతో తాము ఒకరి నొకరు సేవిస్తూ, బద్ధులైన ఇతర జీవులకు ముక్తిని ప్రసాదింపవలెననే భగవంతుని కోర్కెకు అనుగుణంగా వ్యవహరిస్తారు. ఏమైనప్పటికీ వైకుంఠాన్ని వర్ణించడం అసాధ్యము. వైకుంఠాన్ని చూచి అనుభవించినవాడే దీనిని వర్ణింపకలుగుతాడు. మధ్వాచార్యుల సిద్ధాంతం ప్రకారం జీవులలో ఉత్తమ, అధములనే రెండు తెగలవా రున్నారని, ఉత్తమజీవులు మాత్రమే వైకుంఠాన్ని చేరి విష్ణువును సేవిస్తారని, అధమజీవులు

దేహాన్ని వదలిన తరువాత జీవుడు కైలాసాన్ని చేరుతాడు. సశరీరం గానే ముక్తిని పొందవచ్చునని, ఇదే జీవన్ముక్తి అని అద్వైతులు అంటారు వీరి సిద్ధాంతం ప్రకారం జీవుడు బ్రహ్మైక్యాన్ని పొందడమే మోక్షము. హైందవు లందరికి కర్మయోగ, భక్తియోగ, రాజయోగ, జ్ఞానయోగాలలోను, దైవకృపతో సంసారబంధాలను ఛేదించుకొని ముక్తిని పొందవచ్చును అనే సిద్ధాంతంలోను నమ్మకం ఉంది.

మానవుడు సంఘజీవి. అంటే సంఘంలో ఉంటూ సంఘంలో అందరితో పాటు తనకు సుఖశాంతులు కావలెనని కోరుకుంటాడు. ప్రత్యేకంగా తాను కొన్ని కోర్కెలు కోరుతాడు. కాబట్టి తనకీ పురుషార్థాలను అపేక్షిస్తాడు, సంఘంలోని ఇతరుల శ్రేయస్సుకొఱకు పాటుపడుతాడు. అతని కుండే సాంఘికబంధాలను తొలగించుకోవడానికి వీలుపడదు. ఇతరులతో సహకరించడం, ఇతరుల క్షేమానికి పాటుపడడం సంఘజీవియైన మానవుని సహజధర్మాలు. మానవునిలో భౌతిక, ఆధ్యాత్మికాంశాలున్నట్లు సామూహిక, వైయక్తిక అంశాలు కూడా ఉన్నట్లు హిందూమతం చెప్పుతుంది. తన ప్రయత్నాలవల్ల మానవుడు తాను స్వయంగా ఆధ్యాత్మికతను సాధించడమే కాకుండా తాను చేసే సాంఘిక కార్యక్రమాలన్నీ కూడా సంఘంలోని తన తోటి వారితో తాను భిన్నుడు కాడు అనే అభేదాన్ని సూచించడానికే ప్రయత్నిస్తాడు.

హైందవమతం సర్వజనమత సమ్మతమైనది. భిన్నత్వంలో ఏకత్వాన్ని సాధించి సంఘాన్నంతటిని ఒక త్రాటిపై నడిపించడం దాని ప్రథమాశయము. ఈశ్వరుడు ఒకడే కాని వివిధ నామరూపాలతో ఆయనను పూజించి ఈశ్వరసాక్షాత్కారాన్ని పొందవచ్చునని చెప్పడం వల్ల సంఘంలో అందరూ తాము కోరిన రూపంలో ఈశ్వరుని పూజించి తమ కోర్కెలను తీర్చుకొని తామంతా ఒకే మానవజాతికి చెందిన వారము అనే మహోన్నతభావాన్ని పొందగలుగుతారు. హైందవమతం మానవుల హృదయాలకు మాత్రమే రంజకంగా ఉండదు. అది వారి హృదయాంతరాళాల్లోని ఆత్మను, దైవత్వాన్ని రంజింప జేస్తుంది. ఈశ్వరునిలోచేరి ఆయనలో నివసించడమే దివ్య జీవితము. ఇదియే హిందూమతం నిర్దేశించిన గమ్యము.

మానవుని దివ్యత్వాన్ని నొక్కి చెప్పుతుంది. ఇది ఇతర మతాలవలె సంఘవిరోధమైన మతంకాదు. ఈ ప్రపంచం దేవుని లీలావిలాసమని, ఈ విలాసాల్లో అందరూ పాల్గొనవచ్చునని మన మతం బోధిస్తుంది.

హిందూమతంలో సంఘంయొక్క ఏర్పాటు, దాని విధులు, మానవ వికాసపరిణామాలు చక్కగా వివరింపబడినాయి. అంటే వర్ణ విభేదం మానవులు చేసే పనులనుబట్టి, ఆశ్రమ విభేదం మానవుల జీవితకాలంలో ఏర్పడే భిన్న భిన్న స్థితులను బట్టి ఏర్పాటు చేయబడినాయి. కొన్ని సమయాల్లో వీటి కెక్కువ ప్రాధాన్యం ఇచ్చినా వీటిలోని భేదాలు నియతమైనవి కావు. ఒకటితో ఒకటి కలియకుండా శుద్ధంగా ఉండే జాతులు, ధర్మాలు ఉండడం కష్టము. మానవుడు మతంలో మోక్షం, ధర్మం కామం అనే పదాలకు కొత్త విలువలను కనుగొంటాడు. ఈ విలువలు అందరికి అర్థం కావు. మత మనేది మోక్ష, ధర్మ, కామాలనే పురుషార్థాలకు సమన్వయం కల్పించి వీటికి ఉదాత్తమైన అర్థాన్నిస్తుంది. కాని అజ్ఞానంలో ఉన్నవారు మోక్షాన్ని స్వైరవిహారమనీ, ధర్మ మంటే అధికారం చెలాయించడమని, కామ మంటే పశుకామమని విపరీతార్థకల్పన చేస్తారు.

మానవజీవితంలోని కార్యాచరణ మంతా ఉదాత్తభావాలతో నిండి నప్పుడే జీవితం పరిపూర్ణం, సుసంపన్నం, నాగరకం అవుతుంది. హిందూమతంలో చెప్పబడిఉండే ఉపదేశాలు, విధినిషేధాలన్నీ మానవునిలోని అహంకారం, స్పర్థలు, అసూయ, లోభం, హింస, ద్వేషం మొదలైన దుర్గుణాలను పోగొట్టి అతణ్ణి సంస్కరించి ఉత్కృష్టునిగా చేయడాని కుద్దేశింపబడినాయి. వెనుకటి జన్మల పాపపుణ్యాల ఫలితమైన ఈ జన్మమీద సర్వాధిపత్యాన్ని పొంది మతం మానవుల జీవితాలను సంస్కరిస్తుంది.

ప్రపంచంలోని అన్ని మతాలను ఇముడ్చుకో గలుగుతుంది. అందుకే దేశ విదేశాలలో అహింసాపద్ధతిలో వ్యాపించింది. శాంతి ద్వారా జ్ఞానం, జ్ఞానంద్వారా శాంతి అనే రెండు సూత్రాలు భారతదేశచరిత్రలో బాగా కనిపిస్తాయి. ఈ రెండింటిమీద ఆధారపడి వృద్ధిచెందిన సాంఘిక జీవనం నాగరకమైన దని పిలువబడుతుంది. అందువలన ప్రతివ్యక్తి ఆధ్యాత్మికతను సంపాదించుకొనవలెను. ప్రతి వ్యక్తి ఈ జగత్తు దివ్య మైనదని దీనిలో ఒక క్రమము, పద్ధతి ఉన్నాయని తెలిసి కొనవలెను.

జగత్తు ధర్మంమీద ఆధారపడి నడుచుచున్నది. ధర్మబద్ధమైన కర్మలను ప్రతి ఫలాపేక్ష లేకుండా నిస్వార్థంగా సక్రమంగా ఆచ రిస్తే కర్మలు వైయక్తికంగా ముక్తిని, సాంఘికంగా అందరికి శ్రేయ స్సును కలిగిస్తాయి. కర్మయోగంలో చేసిన సత్కర్మలు బ్రహ్మాను భవానికి దారితీస్తాయి. సంఘశ్రేయస్సును కలుగజేస్తాయి.

ప్రజల రాజకీయ జీవితం నాటి నైతిక సాంఘిక విలువలను ప్రతిబింబింప చేస్తుంది. ఏ సంఘంలో జనులకు హక్కులు, స్వాతంత్ర్యం తప్పని సరిగా లభిస్తాయో ఆ సంఘాన్ని రాజకీయంగా ఉత్తమమైన సంఘం అంటారు. ఇటీవల ప్రజలలో ధార్మికచైతన్యం కలుగుతూ ఉంది. ఎంతోమంది వ్యక్తులు, సంస్థలు మతవ్యాప్తికి కృషిచేయడమే ఇందుకు కారణము. దేశంలోని సంఘసేవకు అందరికి మానవతా ప్రబోధం మతంవల్లనే కలిగింది. హిందూమతం ముఖ్యంగా దయ, ప్రేమ, అహింసలను నొక్కి చెప్తుతుంది. మతంలోని ఈ అంశాలను సాంఘిక, రాజకీయ చటాల ద్వారా ప్రవేశ పెట్టడంతో రాజధర్మం ఉన్నతస్థాయికి చేరుతుంది.

మతంలో చెప్పబడిన విధులను, ధర్మాలను నెరవేర్చడానికి ప్రయత్నిస్తూ ఉంది. ప్రభుత్వం సంఘపరిస్థితులను చక్కబెట్టి సంఘంలోని మానవుల సుఖ, సంతోష, స్వాతంత్ర్యాలకు పాటుపడినా 'మీ రిట్లు నడచుకొనకపోతే మిమ్మలను శిక్షిస్తాము' అనే బెదరింపులతో ప్రజలను శాసింపకలుగుతుంది. కాని వారి మనస్సులకు నచ్చజెప్పి వారిని సంస్కరింపలేదు. ఈ భయంతో కొంతమంది అకార్యాలు చేయకపోవచ్చును. కాని బెదరింపులవల్ల, బలాత్కారంవల్ల ఎక్కడకూడ వాస్తవమైన వికాసం కలుగదు. కాబట్టి మతం చేసే సంఘసేవ, సంఘసంస్కారం వంటి పనులను ప్రభుత్వం శాసనాలతో చేయజాలదు. కాని మతం మనుష్యులలో హృదయ పరివర్తనాన్ని తెచ్చి తద్వారా ప్రభుత్వం చేయలేని సంఘసంస్కారాన్ని సంఘసేవను చేస్తుంది. వైద్యులు, మానసికరోగ చికిత్సా నిపుణులు సయితం చేయజాలని వ్యక్తిగత సమస్యలను మత బోధకులు పరిష్కరిస్తారు. ఇహలోక, పరలోక సత్యాలను తెలిసికొని ఆంతరంగిక శాంతిని పొందిన యోగులు, సిద్ధులు మొదలైనవారు కష్టాలలో ఉన్న ప్రజలకు తమ బోధనలతో మానసిక శాంతిని కలుగజేస్తారు. ప్రభుత్వం కాని సంస్థలు కాని ప్రజల మానసిక సమస్యలను తీర్చి వారికి సుఖశాంతుల నివ్వజాలవు. ఈ పనిని మతం మాత్రమే తన ప్రత్యేక పద్ధతిలో చేయకలుగుతుంది. మతంతో జోక్యం చేసికొని మతాన్ని దెబ్బతీయు చట్టాలు చేసే ప్రభుత్వం ఎప్పటికైనా ఛిన్నాభిన్న మవుతుంది. మతం లేక దేవునిస్థానాన్ని ప్రభుత్వం ఆక్రమింపజాలదు.

మోక్షమంటే జననమరణాలు లేని శాశ్వతస్వాతంత్ర్యతలేక ముక్తిని పొందడమే. కాని సంఘంలో చట్టం ముందు అందరు సమానులే అనునటువంటి సమానత్వం ముక్తి విషయంలో ఉన్నదని చెప్పటకు వీలులేదు. స్వాతంత్ర్యాన్ని లేక ముక్తిని మతం మాత్రమే

ప్రసాదిస్తుంది. భౌతిక సుఖసంపదలు మానసిక, ఆధ్యాత్మిక బాధలను తీర్చజాలవు. గొప్ప గొప్ప రాజులుకూడ ఈ కష్టాలనుండి విముక్తిని పొందడానికి తమ రాజ్యాలను కూడ త్యజించినారు. అర్థ, కామములు తుచ్ఛమైనవి. వీటితో నిండిన ప్రపంచము భ్రాంతి, అసత్యము. మానవుడు వీటినుండి తప్పించుకొని బయటపడవలెను. కష్టాల్లో ఉన్న మానవాళిని రక్షించడ మెట్లు అని మతగురువులకు మాత్రమే తెలియును. మతానికి మూలాధారాలైన సంస్థలు, గ్రంథాలు నశించి పోకుండా రక్షిస్తే మోక్షగాములైన వారికి ఎంతో మేలు చేసినవార మవుతాము. మనశ్శాంతిలేని స్వాతంత్ర్యము నిరర్థకము. ఈ శాంతిని దేవుడు ప్రసాదిస్తాడు. దేవుని సన్నిధిలో లభించే అన్ని రకాలైన బాధలు తొలగిపోతాయి. దేవాలయాలు, మఠాలు ఈ విధమైన సుఖ శాంతులకు తగిన వాతావరణాన్ని కలిగిస్తాయి. వీటిలో దైవ సాక్షాత్కారాన్ని ఆత్మసాక్షాత్కారాన్ని పొందగోరేవారు ఉండవచ్చును. అందుకే అడవులలో మునులు, ఋషులు ఉండే ఆశ్రమాలలో ప్రేమ, దయ, తాండవిస్తూ ఉంటుంది. ఆశ్రమాలు కూడ వాటి నాశ్రయించిన మానవులకు సుఖశాంతుల నిచ్చి సేవచేస్తాయి. యోగియైనవాడు భవ బంధాలకు దూరంగా ఉన్న శాంతిని కోరేవారికి ఏ ప్రభుత్వం ఇవ్వలేని శాంతిని ప్రసాదిస్తాడు. మానవు లందరూ శాశ్వతానందానికి మోక్షానికి సమానంగా అర్హులని హిందూమతం చెప్పుతుంది.

మతసంస్థల పరిధిలోనికి అధికారానికి లోబడిన ఆధ్యాత్మిక కార్యక్రమాలను ప్రభుత్వం తన విధులలో ఒక భాగంగా చేపట్టడానికి ఎన్నటికి వీలుపడదు. మతాతీత లేక లౌకికరాజ్యంలో దేశంలో లభించే వస్తువుల నన్నిటినీ సమానంగా నిష్పక్షపాతంగా పంచి ఇచ్చే సుఖశాంతులను ప్రభుత్వం ఇవ్వలేదు. ప్రభుత్వం భౌతికమైన వస్తువులను నిష్పక్షపాతంగా అందరికి పంచిపెట్టడ మనేది ధర్మమనే పురు

కాదు. లౌకికరాజ్య మంటే ప్రభుత్వం ఏ మతంయొక్క విధులను, ధర్మాలను తానే చేయకూడదు అని అర్థము. అట్లని మతసంస్థలు ఇష్టమువచ్చినట్లు వ్యవహరించుటకు వీలుకాదు. శాంతియుత సాంఘిక జీవనానికి భంగం కలిగించే శాస్త్రాలను అదుపులో పెట్టడంలో ప్రభుత్వానికే అధికారం ఉంది. అంతే కాక మతసంస్థలు సక్రమంగా వ్యవహరించునట్లు చట్టాలను చేయడానికి ప్రభుత్వానికి అధికారం ఉంది.

ఏ ప్రభుత్వం కూడ మతాతీతంగా ఉండి ఏ మతాన్ని కూడ ప్రత్యేకించి ప్రోత్సహింప జాలదు. దేశానికంతటికీ విశ్వజనీనమైన ఒకే ఒక మతం కావలెను. కాని పెక్కు మతాలు పనికిరావు. హిందూమతం ఇందుకు ఎంతో తగి యున్నది. ఇది సంఘవాసుల లోను యోగుల, సిద్ధుల ఆచారవ్యవహారాలలోను సంప్రదాయంలోను ఇప్పటికి సజీవంగా ఉంది. ప్రజలలో ఇప్పటికి హిందూమతంలో చెప్పబడిన కర్మ, భక్తి, జ్ఞాన యోగాలవంటి పెక్కు సాధనాలు నిత్య వాడుకలో ఉండడమే మతంయొక్క సర్వజనసమ్మతత్వానికి నిదర్శ నము. భౌతికసభలనుండి మానవుని మనస్సును ఆధ్యాత్మికదృష్టికి మరలించి సంఘాన్ని పునీతంచేసి ప్రజలందరు దేవుని సంతానమని వీరందరు దేవునికృపకు అర్హులని చాటడమే మతంయొక్క ఉద్దేశము.

ప్రపంచమంతటికిని అధిపతియైన ప్రభువు ఒకడున్నాడనీ, ఆయన ప్రేమస్వరూపుడనీ, అన్ని జీవులలో ఉంటాడనీ పదేపదే చెప్పడం వల్ల హిందూమతము విశ్వజనీనమైనది. ప్రతిఒకరూ ఈశ్వరుని పొందగోరవచ్చును, ముఖాముఖి సాక్షాత్కరించుకొనవచ్చును. గొప్ప వారైన ఋషులు, ఆళ్వారులు, నాయనార్లు ఈశ్వరసాక్షాత్కారాన్ని పొందిరి. దేవుడున్నాడని చెప్పడానికి నిదర్శనం ఆదేవుని మనము అనుభవించుట లేక సాక్షాత్కరించుకొనడమే అవుతుంది. దేవుని సాక్షాత్కరించుకొనడంలో మనశాస్త్రాలు చెప్పిన విషయాలు హేతుబద్ధమైనవి, శాస్త్రీయమైనవి, స్వానుభవంతో సరిచూచుకోదగినవి, సక్రమమైనవి కాబట్టి హైందవుల శాస్త్రాలు సైన్సుకు విరుద్ధం కావు. దేవుడు సత్యము, అమలము. కాబట్టి సాత్త్విక ప్రవృత్తికల శుద్ధహృదయులే దేవుని చేరగలరు. చేరదగిన గమ్యము శుద్ధమైనదిగాబట్టి చేరడానికి ఉపయోగించే సాధనంకూడా శుద్ధంగా ఉండవలెను. అందుకే హిందూమతం ఆధ్యాత్మిక జీవనానికి మనోవాక్కాయకర్మలలో పరిశుద్ధి ముఖ్యం అని చెప్పుతుంది.

ఒకరున్నట్లు మరొకరుండరు. జనులు విభిన్నతత్త్వాలు కలవారు అంటే అధికారి భేదాన్ని బట్టి ఈ విభిన్న తత్త్వాలకు అనుగుణంగా వేర్వేరు ఆధ్యాత్మిక మార్గాలు హిందూమతంలో సూచింపబడినాయి. మానవులు ఏ రూపంతో దేవుని అర్చిస్తే దేవుడు ఆ రూపంతో సాక్షాత్కరిస్తాడు. అందువలన మోక్షాన్ని కోరేవారు శుద్ధహృదయంతో దేవుని ప్రార్థించ వలెను.

సాధారణంగా ప్రతిపట్టణంమధ్యలో దేవాలయాలు ఉంటాయి. దేవుడే అన్నిటికి కర్త అనీ, ఆయనే అన్ని పనులూ చేయిస్తాడనీ దేవాలయాలు జ్ఞాపకం చేస్తాయి. కుటుంబము, విద్యాశాల, దేవాలయం,

మవుతుంది. ప్రతి మానవునిలో భగవంతుడు అంతర్యామిగా ఉండడంవల్ల మానవులమధ్య భేదాలు తారతమ్యాలు లేవు. పరమత సహనంలోను భిన్నభిన్న దేవతలను ఆరాధించడాన్ని అనుమతించడం లోను హిందూమతానికి గొప్పపేరు ప్రతిష్ఠ లున్నాయి. కానీ పరిశుద్ధ మైన నైతిక జీవనాన్ని గురించి రాజీపడడానికి ఇచ్చట తావులేదు. పరమతసహనం, విశ్వజనీనత — ఈ రెండే కాక బ్రహ్మము అంతర్యామిగా అన్ని జీవులలో ఉంటాడని చెప్పడము, ఈశ్వరుడు అవతారాలనెత్తి పీడిత మానవాళిని ఉద్ధరిస్తాడని చెప్పడము, జీవులందరూ సమానమనీ ముక్తికి అర్హులనీ చెప్పడం హిందూమతంలోని విశిష్టలక్షణాలు. మత విద్య అందరికీ అవసరమనీ మతప్రచారం చేయదగుననీ హిందూ మతము అంగీకరించినప్పటికీ నిర్బంధంగా మతాన్ని ప్రచారం చేయడం, మతాంతరీకరణాన్ని అది అంగీకరింపదు.

హిందూమతంలోని ముఖ్యాంశాలను విడువకుండా నేటి కాలానికీ సమాజానికీ అనుగుణంగా హిందూమతాన్ని ప్రచారంచేయడం ఇప్పటి ముఖ్యకర్తవ్యము. దీనికి తగిన మత ప్రబోధకులను తయారుచేసి వారికి మత ప్రచారానికి తగిన వసతులు కల్పించవలెను. మతం పేరిట ప్రచారంచేసే అన్ని సదాచారాలను ధర్మాలను వారు స్వయంగా పాటింపవలెను. ఆచరణలో లేని మతబోధ నిరర్థకము. మతాన్ని ఆచరణలో పెట్టలేనివారు మతబోధ చేయకూడదు. భారతదేశంలోని ఆధ్యాత్మిక సంస్థలు, మఠాలు తమప్రత్యేక సంప్రదాయాలను నిలుపుకున్నప్పటికీ అవి కలసికట్టుగా ఉండి తమ విధులను ఒకచోట చేర్చి దేశంలోపలినుండి బయటినుండి హిందూమతానికి కలుగుతున్న హానిని అరికట్టవచ్చును. కలియుగ వైకుంఠమైన, శ్రీనివాస నిలయమైన తిరుమల ఈ ఆధ్యాత్మిక చైతన్యాన్ని వికసింపజేసి సంఘంలో నైతిక పునరుజ్జీవనానికి హిందూమత రక్షణకూ చాలాతగినదని చెప్పడంలో సందేహంలేదు.